శ్రీ రామ

# ప్రవృద్ధపాండవము



గ్రంథకర్త

## పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు








ప్రకాశకులు

## రెడ్డి సోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

బ్రాంచి:—రాజమండ్రి

1938

రిజిష్టరు చేయబడినది ] [ వెల 8 అణాలు

# విషయసూచిక



శ్రీ రా మ

# ప్రవృద్ధ పాండవము

## —:పాండవ జననము:—

పూర్వము చంద్రవంశజు లగు రాజులకు హస్తినాపురంబు ముఖ్యపట్టనంబై భరతఖండం బఖండంబుగ వారిచేఁ బరిపాలింపఁబడుచుండెడిది. అయ్యైయ్యందవులలో విచిత్రవీర్యునకు ధృతరాష్ట్రుఁడు పాండురాజు నను నిరువురు పుత్రులుండిరి. ధృతరాష్ట్రుఁడు జాత్యంధుఁ డగుటచేఁ దండ్రి యనంతరము పాండురాజే మండలాధిపతి కావలసి వచ్చెను. అయినను నాంబాలికేయుం డన్న యెడఁ గల గౌరవముచే నాంబికేయునే సింహాపీఠిపైఁ గూర్చుండఁబెట్టి యెల్ల కార్యములును దానే నిర్వర్తించుచుండెను. గాంగేయు శరబలంబును విదురు బుద్ధిబలంబును వారి కత్యంత సహాయజనకంబులై యొప్పారె. పాండురాజు దిగ్విజయంబుచేసి చతుస్సముద్రముద్రిత పృథివీతలంబు నన్న వశంబు సేసి యపార మణిగణ కనకనికరంబుచేఁ గోశాగారంబు నింపి పెంపుదీపింపఁ బెక్కశ్వమేధంబుల నగ్రజుచేఁ జేయించె.

తదుపరి యొకనాఁడు పాండు భూమండలాఖండలుండు మృగయాక్రీడావినోదంబునఁ బ్రొద్దుపుచ్చ నిచ్ఛ

గించి హిమవత్ ప్రాంత వనాంతభూముల కరిగి పెక్కు మెకంబులఁ జక్కాడి యొక్కచో జంటబాయని మృగమిథు నంబు నక్కటికంబులేక యొక్కకోల నేలఁ గూలనేసె. ఆ దుగలో మగమెగం బల్పావశిష్టప్రాణంబున "నో రాజ పుంగవా! దుష్టమృగంబుల వధియించుట పాతకంబుగాదు గాని నిరపరాధజీవుల హింసింప నీవంటి ధార్మికులకుఁ జన్నే? పఱవనోపక దీనాననంబున వెనుఁజూచువానిని, మైమఱ చిన వానిని, జంటఁ బెనఁగినవానిని, బ్రసవించుచున్న వానిని, జరారోగపీడితంబులగువానిని నెఱచి యమోఘిరం బుగఁ గొను నెఱుకుమొఱకులైనఁ బాడిదప్పి యెప్పాట నొప్పింపరు. భరతకులదీపకుండవై సర్వధర్మముల యిమ్మె ఱింగిన నీ విట్లుసేయ నెట్లు మనసాడె? సర్వప్రాణి సాధార ణంబగు సుఖావసరంబున నున్న మమ్ముఁ జంపితివి కావున నిఁక నీకుఁ బ్రియాసంగమ సమయంబునఁ బంచత్వంబు సిద్ధించుఁగాత" మని శపించి విగతప్రాణంబయ్యె.

అదిగని పరమ నిర్వేదనపరుండై పాండుభూపతి మంతనంబునఁ బెనుచింత నొంది కాంతలగు కుంతీ మాద్రుల తోడ శతశృంగ పర్వత శృంగంబునకు నిర్గమించి సర్వేంద్రి యంబుల నియమించి వానప్రస్థంబునఁ గందమూల ఫలాశ నుండై తపంబు సేయుచుండెను. అంతం గొన్ని దినంబులకు

గొంతికి దుర్వాస వరకారణంబున ధర్మ నంశంబున యుధిష్ఠి రుండు శుభముహూర్తంబునఁ బుట్టె.

అంబాలికేయుండు వానప్రస్థుం డగుటకు ధృతరాష్ట్రుండు చాల చింతించెను. కృష్ణద్వైపాయను వరంబున గర్భంబుదాల్చిన యాంబికేయు రాణియగు గాంధారి, కుంతి పుత్రవతి యగుటకును, దాను వత్సరకాలం బతిక్రమించియుఁ బ్రసూతి గాకుంటకు నసూయ నొంది కడుపుగ్రుద్ది కొనియె. ఆ తాడనంబునకు గర్భపాతంబై భావిసూచనయుంబోలె శత శకలంబులయ్యె. అపుడు పారాశర్యుం డచ్చటికేతెంచి "నీ కిట్టిగొనమ్మ తగునే?" యని గాంధారిం బదరి వేదమ్ములు విభజించినట్లు పిండశకలమ్ముల విభాగించి ఘృత భాండమ్ముల నుంచి శీతలజలమ్ముల అభిషేకించుచుండ నియమించి నూర్వురు పుత్రులు నొక పుత్రికయు నుదితులగుదురని వచించి చనియె. ఆవలఁ గొన్నాళ్ళ కా భాండమ్ములనుండి దుర్యోధనాది సుతశతమ్మును దుశ్శల యను సుతయు జనియించిరి.

దుర్యోధనుండు పుట్టిన దినమ్మననే కుంతికి వాయ్వంశమున మహాబలుఁడగు భీమసేనుండు జన్మించె. అమ్మఱు వత్సరమున లోకోత్తరుండగు నర్జునుండు ప్రభ కుదయించె. తదుపరి కుంతి యనుమతమున మాద్రి యశ్వినీదేవతల నారా

ధింప వారి యంశంబున నాయమ గర్భంబున నకుల సహదేవులు ప్రాదుర్భూతు లైరి.

అనంతరంబు వసంతమ్మున నొకదినమ్మునఁ గుంతి మద్రపుత్రి రక్షణంబునం దేమఱియున్న తఱిని పాండురాజు మాద్రి మనోహరాకృతికి మదనపరవశుండై కింద ముని శాపము డెందమునం దలంపక యమ్మగువం గవిసి యసువులఁ బాసె. భర్తృమృతికిఁ దానకారణమ్మని యమ్మాలికమ్మునఁ దన తనయుల సవతి కొప్పగించి పతితోడఁ జితిపైఁ బరుండి సహగమనముసేసె. అచటి మునిముఖ్యులు గొంతిని గొడుకుల నూఱార్చి హస్తిపురికిఁ దోడితెచ్చి ధృతరాష్ట్రున కప్పగించి పోయిరి.

## —:కుమార క్రీడలు:—

తన సుతులఁ దమ్ముని తనయుల నొక్కరూపున భావించి కురువల్లభుండు పోషించుచుండ నక్కుమార పంచోత్తరశతంబు దినదిన ప్రవర్ధమానంబై కుమారక్రీడలం దవిలి కలచునెడఁ బఱచునెడఁ బెనఁగునెడ మునుఁగునెడ నాడునెడఁ బాడునెడఁ బరస్పర విజిగీషా మనస్కులై చూపఱు కనులకుఁ బండుగుసేయుచుండె. అందు విశేషించి వాయ్వంశజుండగు భీమసేనుం డపారబలుండై యీఁదులాడుచో ధార్తరాష్ట్రులఁ బందుండ్ర నొక్కొక భుజంబున నెక్కించుకొని ముంచి ముంచి కారించి తీరంబుఁ జేర్చు. పెనఁగు

లాటలయందుఁ బాండవుల నొకవంకను గౌరవుల నొకవంకను నిలిపి గాంధారేయులఁ దా నొక్కండ జయించు. ఫలార్థులై వార లెక్కిన మ్రాఁకుల ఫీఁకనూఁకించి పండులతోఁ గౌరవ తండంబు నురలించు. ఏయాటయందును గురుకుమారులు మారుతిని మించరైరి. అంతియకాక బాధితాత్ములు కూడ నగుచుండిరి. దీని కోర్వక దుర్యోధనుండు తన తమ్ములతో రహస్యముగ నాలోచించి మదోద్ధతు మరుత్సుతుని హతుఁ జేయ సంకల్పించె. ఇదియే కురుపాండవ కలహబీజము.

ఒకనాఁడు భీముఁడు చల్లులాడి యలసి యొక్కండ యొక్కచోఁ గూర్కు నొంద నది యదనని కౌరవు లతనిఁ దీవల బంధించుకొనిపోయి గంగమడుఁగునఁ ద్రోసిరి. గుభాలున మడువునఁ బడుటతో వడముడి మేల్కని నీగ్గి లతికా బంధంబులఁ ద్రెంచికొని కర్మబంధంబుల ద్రుంచి పుణ్యగతికి నెగయు పురుషునికరణి నీటినుండి యెగసివచ్చె.

మరల నొకనాఁడు సుయోధనుండు క్రూరవిషదంష్ట్రా కరాళంబులగు నురగంబులచేఁ బావనిఁ గఱపింప సారథిని నియోగించె. వాఁడు నిద్రితుఁడగు మరున్నందను మర్మాంగ సంధులఁ గృష్ణసర్పములచేఁ గఱపించెఁ గాని యతని వజ్రమయకాయంబున నవ్వ్యాళదంష్ట్రలు దిగఁబడనోపవయ్యె. పాపవ్యవసాయుల చెయివు లెన్నండు సర్థవంతములు కానేరవు. అంత భీముఁడు మేల్కని యవ్విషోరగంబులఁ

గాలం జమరి సారథి ముక్కున వాతనెత్తు రొల్కఁ గేలఁ జఱచి వానిం గాలుప్రోలికిఁ బుచ్చె.

మఱియొక దివసంబున నందఱు వేడ్కమెయిఁ గొంత వడి వనవిహారంబు సలిపి కొంతసేపు జలవిహారంబు సేసి యలసి దుర్యోధనుండు దెప్పించిన భక్ష్యంబులఁ గుడువ వచ్చిరి. అందు భీమున కిప్పించినవి విషమిళితములు. అది యెఱుఁగక కతఁడు వాడుకచొప్పునఁ గృష్ణార్పణమని భుజియించెను. భగవదనుగ్రహముచే నది జీర్ణించి యమృతాన్నమయ్యెఁ గాని కొంతవఱకు గాఢనిద్రను గలిగించెను. ఆ తరుణంబునఁ గురుకుమారులు ప్రభంజన పుత్త్రు బంధించి కొని పోయి యీటెలనాటిన యఖాతంబునఁ గూలఁద్రోసిరి. దైవానుగ్రహమున నతఁ డా యీటెలసందున నడుగు మట్టము సేరెను. అందు వసించుచుండిన పాములు పావనిం గఱవఁగా నాతని మేనునుండిన విషమెల్ల వాని పాలయ్యె. అంత భీముండు మేలుకని యా పాముల మర్దింప మొదలిడ నాగరా జతనిఁ దన లోకమునకుఁ గొని చని పెక్కు మర్యాద లొనరించి పదివేల యేనుఁగుల బలము నీఁజాలిన యమృతకుంభములఁ బదింటిని ద్రావనిచ్చి మరలఁ గొని తెచ్చి కరిపురి ప్రాంతమున విడిచెను. భీముఁడు కడతేఱెనని కౌరవులు లోలోన ముదమందిరి. పాండవులు భీముని గానక నలువంకల వెదకుచుఁ జింతాసాగరమున మునిఁగి

యుండిరి. మూఁడవనాఁడు గానుపుపట్టి తోఁబుట్టువులఁ గలిసికొని వారి నానందమయులఁ గావించెను. తాము భీమున కొనరించిన యెగ్గులెల్లఁ గృతఘ్నునకుం జేసిన లగ్గునుం బోలె నిష్పలంబైన సిగ్గువడి వెండియు నపాయంబు సేయు నుపాయంబుఁ జింతించుచుండిరి.

—:విద్యాభ్యాసము:—

భీష్ముని యోగంబునం జేసి కురుకుమారు లెల్లరుఁ గృపాచార్యునొద్ద విలువిద్దెఁ గఱపుచుండిరి. అప్పటికిని వారికి లోలో మాత్సర్యము నశించినది కాదు. కాని మునుపటివలెఁ గాక యిప్పుడు పాండవులు జాగరూకులై యుండిరి. కావున గాంధారేయుల కపటోపాయంబులు వారియెడఁ జాగినవి కావు. ఒకనాఁడు పురబాహ్యప్రదేశంబున రాజనందను లందఱు వేడుకతోఁ గందుకక్రీడ గావించుచుండిరి. కౌరవులు నూర్వు రొక ప్రక్కఁ బాండవు లేవు రొక వంక నిలిచి కందుకంబు నీవంక కావంక కానుపూర్విగఁ బంపుచుండిరి. తాఁ బంపు చెండును భీముఁడే పట్టుకొనవలయునని రోసంబు పురికొలిపి దుర్యోధనుండు తన భుజసత్త్వంబుకొలఁది విసరివైచెను. తన్ను భంగంబు నొందింపనో చంపనో తివిరి వేయుటను వాయుజుండు గ్రహించి బంతి నొడిసిపట్టికొని తన శక్తికొలఁది మరల విసరివైచెను. కందుకంబు వచ్చు నురవడికిఁ గౌరవులు భయభ్రాంతులై

చెల్లాచెదరైరి. భీముండు గొల్లున నవ్వెను. నిరాతంకం బుగా బంతి వోయి యొక పాడునూంత బడియె. దానినెత్తి యిమ్మని దుర్యోధనుఁడు వారల నిర్బంధించి క్రీడానిబంధ నల ననుసరించి పాండవుల వీఁపులపై బండలెత్తి యెండలో నిలువఁబెట్టించెను.

ఆ త్రోవను ద్రోణాచార్యుండు వచ్చి పాండుపుత్రుల యెడ జాలిగొని పడుకులఁ బుడమిం ద్రోసి "మీారలు భరతకుల ప్రసూతులరై శస్త్రాస్త్రవిద్యలఁ గరము ప్రసిద్ధుఁ డైన కృపునకు శిష్యులరై నూతఁబడిన కాంచన కందు కంబు నెత్తికొననేరకుంటిరే? ఇటు చూడుఁ" డని యొక బాణంబును గందుకంబునకు నాటించి దాని పుంఖంబును మఱియొక బాణంబునఁ గాడనేసి యట్లె యొండొండ బాణరజ్జువు గావించి దానిం దిగిచికొని యిచ్చిన రాకు మారు లెల్ల నిచ్చమెచ్చిరి. మెచ్చక వివ్వచ్చుండు కందు కంబును మరలఁ గూపంబునఁ బడవైచి ద్రోణునియట్ల యతండును బాణరజ్జువున దానిని లాగికొనెను. ఆ వింత గని యెల్లరు విస్మయపడిరి. ద్రోణుండు తన మనంబున నితండు తనకు వలయు శిష్యుండని యెంచెను.

తదనంతర మా కుమారులు ద్రోణుం దోడ్కొని పోయి తాత యగు భీష్మునకుం జూపిరి. అతఁ డాతని గారవించి యతని యుదంతంబంతయు నెఱింగి మనుమలకు

నస్త్రగురునిగాఁ జేసెను. నానాదేశ రాజసూనులు వచ్చి ద్రోణునియొద్ద నస్త్రవిద్య గఱచుచుండిరి. కర్ణుండును నతనియొద్ద విలువిద్య నేర్చికొనుచు నర్జును నేర్పును మెచ్చక మచ్చరించుచు దుర్యోధనపక్షపాతి యగుచుండె. అతనిఁ గుంతీపుత్రుఁడని కౌరవ పాండవు లెవ్వరు నెఱుంగరు. గురుపుత్రుండగు నశ్వత్థామయు నర్జును కుశాగ్ర బుద్ధికి మత్సరించి రహస్యంబుగ నన్నసాధకుం బిలిచి 'నీ వర్జునునకుఁ జీకటిఁ గుడువం బెట్టకు' మని పంచిన వాఁడును నట్లు సేయుచుండ నొకనాఁడు పురందరనందనుండు భుజించుతఱి మారుతాహతిం జేసి దీపమాఱిన భోజన క్రియాభ్యాసవశంబున నతండు మిగిలిన యన్నంబుఁ గుడిచి యిట్టులే యభ్యాసవశంబున సర్వవిద్యలు సర్వకాలంబుల సౌలభ్యంబులగునని నిశ్చయించి యది మొదలుగ నంధకారంబున సైతము నస్త్రవిద్యాభ్యాసంబు సేయుచువచ్చె.

అర్జునుని ప్రియశిష్యవృత్తికిని నస్త్రవిద్యాభియోగమునకు ద్రోణుండు కడుంగడు నానందించి 'ధనుర్విద్య యందు నీ కొరులు సాటిలేకుండఁ జేసెద' నని వాగ్దత్తముచేసి మహీ తురంగ మాతంగశతాంగములపై నుండియేయు నేర్పును, దంద్వసంకీర్ణ యుద్ధవిధంబులును, బహువిధ వ్యూహ భేదనోపాయంబులును, దివ్యాస్త్రచయ ప్రయోగోపసంహార క్రమంబును, గదాతోమరకుంత ప్రాసశక్త్యాది వివిధసాధ

నంబులఁ దన యెఱిఁగిన యర్థంబెల్లఁ గొఱఁతలుఁగులు లేక కఱపి తదితరులను సర్వశస్త్రాస్త్రవిద్యల జితశ్రములం జేసె.

ద్రోణుని యర్జునపక్షపాతబుద్ధిని దుర్యోధనుండు నశ్వత్థామయు గ్రహించి లోలోఁ గుంది గురుసన్నిధిని దమ కసుపుబ్బు వెడలఁగ్రక్కిరి. గురుం డప్పు డేమియు సమాధానమీయక సుతునాఁ డొక వృక్షాగ్రమున నొక కృత్రిమపక్షిం గట్టించి యొక్కొక్కనిగాఁ బిలిచి "పక్షిం జూడుము. పిదపఁ దరువుం జూడుము. పదపడి నన్నుఁ గనుము" అని యొక్కొక్కని జూడ నియమించి మీకుఁ గానవచ్చువానిం జెప్పుఁడన, వారలు పక్షి వృక్షము మీరలు నగపడుచున్నా రనిరి. అర్జునుని కట్లే చూపనతండు పక్షి శిరము తప్ప మఱొండు గానరాదన నతని గుఱి మెచ్చి యప్పక్కి నేయుమన నతం డవలీల దాని తల నేల ఁడొల్లనేసె.

మఱియొకనాఁడు ద్రోణుండు శిష్యులతో గంగ కరిగి యందుఁ గ్రుంకులిడుచుండ నొక మొసలి యాతని పాదంబును బట్టుకొనెను. దానినుండి విడిపించుకొన సమర్థుండయ్యు నగ్గురుండు తన్ను విడిపింపుఁడని శిష్యులకుఁ జెప్ప వార లతనిం బట్టిన మకరంబు శరంబులఁ గనుపడమిం జేసి శరంబుల దాని సమయింపంజాలక మిన్నక చూచు

చుండ సురేంద్రనందనుం డేను బాణంబులఁ గానరాని గ్రాహంబును బొలియించి గురుని విడిపించె. శ్రద్ధకొలఁది విద్య యని ద్రోణుండు నొడువ నందఱు నర్జును నస్త్రకౌశలంబుఁ బ్రస్తుతించిరి. సుయోధనాశ్వత్థామలు సిగ్గునొందిరి.

—:కుమారాస్త్రవిద్యాపరీక్ష:—

కుమారులు సర్వశస్త్రాస్త్రవిద్యాపారగులైరని విని ధృతరాష్ట్రుం డమందానంద కందళితహృదయుండై వారి విద్యాప్రౌఢిమంబు గురుజనసమక్షంబునఁ జూడ నిచ్ఛగించెను. ద్రోణుండును దదుద్దేశాయత్తచిత్తుండై యంధరాజున కెఱింగించిన నతండు రంగస్థలంబు సిద్ధంబు చేయించెను. పెద్దలు తత్తదుచితస్థలంబుల నలంకరించిరి. సామాన్యజనంబు లిసుకవైచిన రాలకుండ మూఁగిరి. కాంతాజనంబుల కొఱకు ప్రాంతస్థల మేర్పఱుపఁబడియె. ధౌతాంబరాభరణ మాల్యానులేపనోప శోభితుండై ద్రోణుండును, నతని పిఱుంద ధర్మజ ప్రభృతులు జ్యేష్ఠానుపూర్వంబుగా గోధాంగుళీకను శిరస్త్రాణులై బాణయుత తూణులై ధనుఃపాణులై కురుకుమార శ్రేణియు రంగస్థలంబునకు విచ్చేసి యాచార్యు ననుమతంబున నా రాకొమరులు తమ తమ విద్యాకౌశలంబులఁ జూప మొదలిడిరి. కొందఱసివర్మ కుశలతం గనఁబఱచిరి. మఱికొందఱు స్వనామాంకిత శరంబుల సంధించి లక్ష్యమ్ముల నేసిరి.

ఇట్లు గొందఱు రథ గజ తురగారూఢ దక్షతం బ్రకటించిరి. వేఱొక కొందఱు కుంతతోమర పరశు పట్టిస శూలగదా ద్యాయుధంబులఁ దమ పటిమం జూపిరి.

అంత సభాసదుల వీక్షణంబు లొక్కుమ్మడి నింకొక్క ప్రక్కకు మరలె. అట నేక శృంగసముత్తుంగ శైల ద్వయంబు పోలిక భీమ దుర్యోధను లుద్యద్గదాహస్తులై మహామత్సరంబుతోఁ బరస్పరజయైక కాంక్షతోఁ బోరఁ దలపడిరి. పాదఘాతంబులఁ బృథివి యద్రువ రోదసీ కుహరంబు భేదిల్ల హుంకారంబులు సేయుచు గదాఘట్టనంబుల మిడుగుఱు లుప్పతిలి పఱవ వారి రణంబు ఘోరాకృతిం దాల్చి భావిపాండవ కౌరవ సమరసూచన పటిష్ఠం బై యొప్పె. ద్రోణుం డశ్వత్థామం బంచి వారి పోరు వారించి వారాశిం బోలె మ్రోయుచున్న వాదిత్రశబ్దంబు లుడిగించి "యింక నా ప్రియశిష్యుండగు నర్జును నస్త్ర విద్యా కౌశలంబు గాంచి వినోదింపుఁ" డనియె.

ఘన ధనుర్న్యస్తకన్యస్త దీర్ఘ బాహుండై కనక కవచావృతుఁడై బద్ధతూణీరుఁడై యర్జునుఁడు, తన్నుఁజూచు జనంబులు "వీఁడె కృతహస్తుఁడు. నిస్తులాఖిలాస్త్రవిద్యుఁడు. భరత కులాలంకారుండు. పృథాశాంత గర్భశుక్తి ముక్తామణి" యని పొగడ, నది విని కుంతి యనంతహర్ష విస్ఫారితలోచనయై తనయునిగని పొంగి యానందబాష్పధారలు జడిగొనఁగా

నడతెంచి రంగమధ్యంబున నిలిచి గురుజనంబులకు వందనంబు లొనరించి వారల యాజ్ఞంగొని తన యస్త్రవిద్యాపాండితిం జూపమొదలిడి యాగ్నేయాస్త్రంబున భీకరాగ్నిం బుట్టించి వారుణాస్త్రంబున నపారజలంబుగల్పించి యనిలశరంబునఁ బ్రచండవాతంబు గలిగించి మేఘబాణంబున మహామేఘంబుల నొనరించి భూమిబాణంబున భూమ్యాకారమునఁ గన్పట్టుచు, శైలబాణంబునఁ బర్వతాకృతిం బొడకట్టుచు నదృశ్యాస్త్రవిద్య పేర్మి నదృశ్యుండగుచు క్షణక్షణంబున హ్రస్వుఁడగుచు దీర్ఘుఁడగుచు సూక్ష్ముఁడగుచు స్థూలుఁడగుచు రథియగుచు సారథియై కానంబడుచుఁ దురగగతుండై పోడసూపుచు మహీగతుఁడగుచుఁ జూపఱకనుల కబ్బురంబు సంపాదించి యైంద్రజాలికుని పోలిక నెల్లర స్తంభీభూతప్రాణుల నొనర్చె. ధన్యవాదంబు లాశీర్వాదంబులు పొగడ్తలు కరతాళధ్వనులు వాద్యధ్వను లొక్కటై బెరసి రోదోంతరంబు నిండె.

ఆ సమయమున సభ్యుల మనముల కాశ్చర్యంబు సంపాదింపఁ గర్ణుండు భుజాస్ఫాలనంబు సేయుచు రంగద్వారంబునఁ బొడకట్టె. సభయెల్లఁ జీమ చిటుకుమన్నఁ దెలియునంత నిశ్శబ్దముతో నుండె. ఘనతనుండును, సహజోజ్జ్వలత్కవచకుండలుండును, బాలార్క ప్రతిముండును, సువర్ణవర్ణుండు నగు కర్ణుండు రంగమధ్యంబునకుఁ జొత్తెంచి కృప

ద్రోణులకు నమస్కరించి సజలజలధర ధ్వాన గంభీరవచనం
బుల సవ్యసాచి నాక్షేపించి "యర్జునా! నీవ కడు నేర్పు
కాఁడవని నిక్కవలదు. నీవంటివారు పెక్కురున్నారు. నీవు
చూపినవెల్ల నేనును జూపనోపుదు" నన నతని పలుకులు
జనులకు విస్మయమును, నరునకుఁ గోపంబును, సుయో
ధనునకుఁ బ్రీతియు నొనరించె. పదపడి కర్ణుఁ డర్జునుండు
సూపిన యస్త్రవిశేషంబు లన్నియు నశ్రమంబునఁ జూపె.
దుర్యోధనుండు మెచ్చి వానితో సఖ్యం బాచరించె. దుర్యో
ధన ప్రీతికై కర్ణుం డర్జునుని ద్వంద్వయుద్ధమున నీ లావు
చూపుమనియె. "తులువా! పిలువఁబడకమున్న సభలకుఁ
దానై చనుదెంచి పరాత్మ పరిమాణంబు లెఱుంగక పాప
భాగులు చను లోకంబులకుఁ జన గోరి త్రుళ్ళిపడియెద వేల?"
యని యర్జునుఁ డధిక్షేపింప నినతనయుండు గనలి "యోరి
శూరమ్మన్యా! ఈ రంగభూమి యస్త్రవిద్యా విశారదులకు
వీరాగ్రేసరులకు సామాన్యముగాక వీరికిఁ జొరనగు వారికిఁ
గాదను తారతమ్యంబుగలదే! పలుకులునేరక దుర్బలాశ్వా
సాక్షేప నిబంధనములు పలికిన పౌరులు నగరే? వీర్యవం
తుఁడవేని నిశితాస్త్రములతోఁ బ్రత్యుత్తర మి" మ్మనుడు
నర్జునుండు నాచార్య భ్రాతృచోదితుండై యుగాంతకాలా
నలుంబోలెఁ బ్రతిఘటించి నిలిచిన నయ్యిరువురకు నెక్కటి
కయ్యంబు ప్రవర్తిల్లె. దుర్యోధనాదులు కర్ణువలన భీష్మ

ద్రోణ కృప పాండవు లర్జును వలన నిలిచిరి. దివ్యాస్త్రం బుల దివ్యులు మర్త్యులు నెఱఁగఁద వారిరువురుఁ బోరాడిరి. కర్ణు నంపజడిలో నర్జునుఁడు కొంతవడకుఁ గానంబడకుండె. కొడుకున కెడరు దోఁచెనని కాఁదలంచి గొంతి ధృతిచెడిగి సొమ్మసిల్లి విదురుని శీతలోపచారంబులఁ దేఱి పరిదేవించు చుండె. అర్జునుఁ డనిలాస్త్రంబున నమ్మేఘపటలంబు పఱవ నేసిన నిరువు రాదిత్యసములై దర్శితులైరి. అపుడు ధర్మాధర్మవిదుండగు కృపాచార్యుం డయ్యిద్దఱనడుమ నిలిచి "కర్ణా! కయ్యంబునకు నెయ్యంబునకు వియ్యంబునకు సమత వలయునండ్రు. పాండుపుత్రునితో రణం బాచరింప నింకను వలతేని నీ వంశమును దల్లిదండ్రులం బేర్కొను" మన రాధేయుండు కుల జననీ జనకుల నామంబులఁ జెప్ప సిగ్గుపడి తల వాంచె. కర్ణ పక్షపాతి యగు సుయోధనుం డప్పు డిట్లనియె. "కులీనుండు శూరుం డధికసేనావంతుఁడు మువ్వురు రాజ శబ్దంబు ధరియింప నర్హులు. అది యెఱింగియు నెఱుఁగనివారి తెఱఁగున నిట్లాడనేల? రాజగు నర్జునునితో రాజుగాని యీ కర్ణుండు రణంబుసేయఁ దగఁడేని యిప్పుడ యిందఱి సమక్షంబున నంగరాజ్య మితని కిచ్చి రాజుం జేసెద" నని ధృతరాష్ట్రు నొప్పించి కర్ణు నభిషిక్తుం జేసె. నన్నింతవానిగాఁ జేసిన నీ యుపకృతి కే నేమిసేయుదు నని కర్ణుండన విడువని చెలిమిగలిగియుంట ప్రతిఫలంబని దుర్యోధనుండు వాక్రుచ్చె.

కొడుకు రాజ్యాభిషేకంబు చూచి హర్షపరవశుండై యధిరథుండు రథంబు డిగ్గి వినయ వినమితో త్తమాంగుడయిన తనయుని గాఢాలింగనంబున గారవించె. అది గని భీముండు కర్ణుని సూతపుత్రునిగా నెఱింగి నగుచుఁ బరిహాసవాక్యంబుల నిట్లనియె.

"సూతనందనా! ప్రతోదముగొని రథము గడపఁదగు నీకు నమ్మెలుగొని నృపధర్మోదయుఁడగు నర్జునుతో రణంబుసేయఁ దగునే?

తే. ఉత్తమ క్షత్రియ ప్రవ రోపయోగ్య
మైన యంగరాజ్యంబు నీ కర్హమగునె?
మంత్రపూతమై గురు యజ మాన భక్ష్య
మగు పురోడాశమది కుక్క కర్హమగునె?"

అని యెత్తిపొడిచెను. ఆ పలుకులకుఁ గర్ణుండు బదులు పలుకనేరక వెలుకఁబాఱిన మొగంబుతో నాదిత్యుం జూచుచు మిన్నకుండె. అతి వ్రీడితుండైన యా రాధేయుంజూచి యలిగి భ్రాతృపద్మ వనమధ్యంబునుండి దుర్యోధన మదాంధగంధ సింధురంబు వెలువడి వచ్చి భీమున కిట్లనియె.

"అనిలజా! లేడికడుపున బెబ్బులిపుట్టునే? ఇట్టి దివ్యతేజం బల్పునికి జనించునే? ఇంతయేల? శూరుల సురల నదుల జన్మంబు లడుగంజెల్లునే? వజ్రంబు దధీచి యెమ్మునఁ బుట్టదే? స్కందుని జన్మమున కాకర మేది?

ధర్మవిమండగు కృపుండు శరజన్ముండుగాఁడే? ద్రోణుండు కుంభసంభవుండుగదా? విప్రులకు సక్షత్రియు లుదయింపరే? ఇంతదూరము తడవనేల? మీ జన్మంబులు సైత మిట్టివిగావే? దివ్యలక్షణ లక్షితుండును సహజ కవచకుండలుండును గాని ప్రాకృతపురుషుండు గాఁ" డని కర్ణుం దోడ్కొని యస్త్రవిద్యాసందర్శన రంగంబు వెలువడి నిజ మందిరంబున కరిగి నాఁటిరుండి కర్ణు బాసటఁజేసి యర్జును వలని భయంబుడిగి బోమ్మనఁ జేయిడి హాయిగ నిద్రవోయె. కర్ణుంగాంచి గొంతి తన ప్రథమ తనయుండని యెఱింగియు లోకాపవాదంబునకు వెఱచి బయల్పడక పుత్త్రప్రేమ యెఱుకపడనీక యుండె. కర్ణ దుర్యోధను లేగిన తరువాత నందఱు తమ తమ సదనంబుల కేగిరి.

## —:గురుదక్షిణ:—

మఱునాఁడు వఱువాత లేచి గురుండు నిత్యకృత్యంబుల నిర్వర్తించికొని పఠనమందిరమునకు విచ్చేసెను. యథారీతిని శిష్యులందఱు వచ్చి గురునకుఁ బ్రణమిల్లి "మహాత్మా! తమయొద్ద .నభ్యస్తశస్త్రులమైతిమి. గురుదక్షిణ సమర్పింపఁ గోరిక పొడముచున్నది. గురుదత్తంబు శాశ్వతంబు. శిష్యులర్పించునది నశ్వరంబు. అయినను మా యభిలాషంబు వ్యర్థపఱుపక భవదభీష్టంబు మా కెఱుక పఱుపుఁ" డనవుడు ద్రోణుం డిట్లనియె.

"అంతేవాసులారా! మీ భక్తికిఁ గడు సంతసంబాదవె. నా కొండు కోర్కి గలదు. అది మీచే నెఱవేఱుట సమంజ సంబు. దాని వివరింతు వినుండు. తొల్లి బాల్యంబున నేనును బాంచాలరాజసుతుండగు ద్రుపదుండును నగ్నివేశుం డను మునివరు నొద్ద ధనుర్వేదం బభ్యసించుతఱి 'నేను రాజగు నాఁడు నా యొద్దకు వచ్చి నా రాజ్యభోగంబుల నీవు ననుభ వింపు' మని స్నేహార్ద్రచిత్తంబునఁ బలికె పృషతు పరో క్షంబునఁ దాను రాజగునాఁడు నేను గృపిని బాణిగ్రహ ణంబు సేసి యశ్వత్థామ యను పుత్త్రుం బడసి వాఁడు పాల కేడ్చు దారిద్ర్యంబుకంటెఁ గష్టం బొండెద్దియు లేదని యెదం దలపోసి మరణంబుకంటె నైచ్యంబైన యాచ్ఞాగుణంబు కారాదని వగచి యెడరులలో బాల్యసఖు వేఁడికో లుచితంబ యని నిశ్చితాత్ముండనై ద్రుపదునొద్దకుఁ జని నన్నును బాల్యమైత్రి నెఱిఁగించికొని నాలుగు పాఁడియావుల నడి గితి. నా పలుకులు విన సహింపక పార్షతుం డలిగి "ఓయీ పాఱుఁడా! తారతమ్య మెఱుఁగక యిట్లు పలుకఁ దగవ య్యేనే? సమశీలవ్రతులకు సమసుచరితులకు సమ ధనవంతు లకు సఖ్యం బొడఁగూడుఁగాక!

చ. ధనపతితో దరిద్రునకుఁ
దత్త్వవిదుండగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁ
గ్రూరునకుం రణశూరుతోడ భీ

రునకు వరూథితోడ నవ
రూథికి సజ్జనుతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను
సఖ్యము దా నొడఁగూడ నేర్చునే?

అదియుఁగాక రాజులకుఁ గార్యవశంబునం జేసి మిత్రామిత్ర సంబంధంబులు సంభవించుఁ గావున మీబోఁటి పేద పాఱువారలతో మాయట్టి రాజులకుఁ గార్యకారణవశంబైన సఖ్యం బెన్నండును గానేర" దని సదస్సున నవమానింపఁ జేయునది నేరక యూరక యటనుండి యిటకువచ్చితి. ఆ యవివేక కారణ దారుణైశ్వర్యగర్వితుండగు పార్షతు నొడిచిపట్టితెండు. ఇదియ నా కిష్టంబైన గురుదక్షిణ"

గురుని పలుకుల కుల్లసిల్లి వల్లెయని నృపనందను లెల్లరసంఖ్యబలసమేతులై దిశలు భేదిల్ల నార్చుచుఁ గదలి పాంచాలుపురంబు ముట్టడించిరి. కాని పాంచాలు శరవృష్టి సైఁపనేరక దిశలకు విచ్చి పాఱిరి. అది గని యర్జునుండు "గురుసఖుఁడని యైన యెన్నక ద్రుపదు నల్పునిగా నెంచి తాఁకిన నెట్లగు?" నని గురు ధర్మజులకుఁ బ్రణమిల్లి దీవనలంబడసి భీమసేనుండు సేనాగ్రచరుండుగాఁ గవలు చక్రరక్షకులుగాఁ గదలి పాంచాల వాహినీపారావారంబు సొచ్చిన భీముఁడు సర్వసైన్యంబుల నుగ్గాడుచుఁ జెదర్చె. అర్జునుండు ద్రుపదుఁ గాలుసేతులు గదల్పనీక యుపవానను ముంచి యతని రథంబుమీఁదికి లంఘించి,

క. "ప్రక్షీణదర్పు ద్రుపదు ర
థాక్షముతోఁ గట్టితెచ్చి యర్జునుఁడు క్రియా
దక్షుండయి గురునకు గురు
దక్షిణ దానిచ్చిచేసెఁ దత్సమ్మదమున్.

క. వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె! యిట్లు కృపణులై పట్టువడన్
వీరికి వలసెనె! యిపుడు మ
హారాజ్య మదాంధకార మడివానెనో కో!"

అని ద్రోణుండు నగుచు ద్రుపదు సమీపించి "యింక నైన మమ్ము నెఱుఁగనగునే? ఇతఁడు నా శిష్యుఁ డర్జునుం" డని కట్లు విడిచిపుచ్చె. "ఇంత కష్టించి తెమ్మనుట యింత సులభముగ విడిచిపుచ్చుటకేనా? ఉత్తముల కోపంబును దృణహుతాశనంబును దీర్ఘంబులుగానేర" వని రాకుమారు లనిరి. అర్జునుని పరాక్రమంబునకు సంతసిల్లి గురుండు బ్రహ్మశిరోస్త్రంబు సప్రయోగనివర్తనంబుగా నిచ్చి యెన్నఁడేని నేను యుద్ధంబుసేయునపుడు నాతోఁ బ్రతియుద్ధంబు సేయకుంటయ నీ విచ్చు గురుదక్షిణ యనఁ బాండవ మధ్యముండు ప్రణామపూర్వకంబుగ నంగీకరించె.

ద్రుపదుండు ద్రోణునిచే బంధవిముక్తుండయ్యుఁ గోప పాశబద్ధుండై యప్పరిభవంబునకుఁ బ్రతీకారంబు సేయం దలఁచి బ్రాహ్మణోపాస్తి సేయుచు వానప్రస్థుండై యుప

యాజి యను మునిం బ్రార్థించి 'నీకు లక్ష ధేనువు లిచ్చెద. ద్రోణుని వధింపఁ గల పుత్త్రుండును, నర్జును దేవిగాఁ గల పుత్త్రియుఁ బొడము నిష్టి సేయింపు' మన నతండు ఫలార్థి యగు మా యన్న కడకుఁ బొమ్మన నతం డతని కడ కేగి యర్థింప యాజుండు యాజకత్వంబున కొడంబడి పృవత పుత్త్రునిచేఁ బుత్త్ర కామేష్టి సేయించె. అయ్యగ్ని కుండంబు నుండి భయంకరాకారుఁడును వివిధాయుధ ధరుండును వర్మ కిరీటాది భూషణ భూషితుండును రథారూఢుండు నగు పుత్త్రుండును సర్వలక్షణ సంపన్న యగు కుమారీరత్నము నుదయించిరి. వారలకు ద్రుపదుండు ధృష్టద్యుమ్నుండు కృష్ణ యను నామంబుల నిడి, ప్రేమం బోషించుచుండె.

ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు యౌవరాజ్య ధురం ధరుఁగా నెఱింగి భీష్మ విదురులతో విచారించి యౌవరా జ్యాభిషిక్తుం జేసె. తమ్ము లుల్లసిల్లిరి. దుర్యోధనాదులు లోలోఁ దల్లడిల్లిరి. మంతనంబులు సేసిరి. శకుని యాప్త మంత్రి కణికుఁడనువాఁ డిట్లనియె.

"దుర్యోధనా! ధరణీశుఁడగువాఁడు దండవిధానం బున వర్ణాశ్రమధర్మంబులఁ దప్పక నడపుచుండు. కార్యా కార్యము లెఱుఁగక దుశ్చరితుఁడైన యహితుని గురునైన శాసింపవలయు. అవిచారితకార్యంబు తుదిముట్టనేరదు. ఏకార్యమునైన మృదుతనైన దారుణభంగినైనఁ దన్నుపా

యంత నొందకుండ నేర్పున నెఱవేర్పవలయు. ఆత్మచ్ఛిద్ర ము లన్యు లెఱుంగనీక పరుల ఛిద్రము లెఱుంగవలయు. బలహీనులైన యపుడ శత్రులం జెఱుపవలయు. వారి నల్పులని యుపేక్షింపం జనదు. ఇంచుక ముల్లైనను బాదంబున నున్న నడవ శక్యమగునే? వీరు వారనక రా జెల్లప్పు డేరిని నమ్మకుండునది కార్యంబు. అపకారిని దన యొద్ద నిడికొని యుండువాఁడును విటపివిటపాగ్రంబున నిద్ర వోవువాఁడును సమానులు. శాత్రవు సామ దాన భేదముల నమ్మించి సులభోపాయంబున నిర్జించుట నీతిమంతుల లక్షణము. అపకారులయినవారిని బరులనైనఁ బాంధవులనైన నుపేక్షింపక యాత్మరక్షాపరుండవై దూరంబు సేసి దూషింపుము"

శకునిమతంబు విని దుర్యోధనుండు చింతాక్రాంతుండై యొకనాఁడు తండ్రికడఁ జేరి యడఁకువ గదుర నిట్లనియె. "తండ్రీ! పాండవులు వీరులని వారి కెల్లప్పుడు వెఱతు. దానికిఁ దోడు వారికి యౌవరాజ్య మిచ్చితివి. దానం జేసి పౌరులు నిన్ను ననాదరింపకున్నారు. ప్రజ్ఞా చక్షుండు ప్రాభవంబునకు సమర్థుండుగాఁడు. భీష్ముఁడు మున్నె రాజ్యనివర్తనంబునఁ గృతప్రతిజ్ఞుండయ్యె. తరుణుండయ్యు గుణవృద్ధుండైన ధర్మజుండు పరాక్రమవంతులై విధేయులైన తమ్ములఁ గలవాఁడు సర్వవిధంబుల సామ్రాజ్య

పట్టాభిషేకమున కర్హుండు. అతని యందు మనము సుఖం బుండువారము. దీనికి భీష్మ విదురు లాదరింపబడఁగలవారని యెప్పుడు విచారింతురని వింటి. వెంటనే పాండవు లప్పురంబు వాయునట్లుగాఁ జేయుము” అనిన కొడుకునకు జనకుఁ డిట్లనియె.

“కుమారా! నేను రాజ్యాభిషేకంబున కనర్హుఁడ నైనను దమ్ముండగు పాండునృపాలుండు నన్నధికగౌరవంబున సింహాసనంబుపై నునిచి జగజ్జిగీషుండై యెల్లనృపతుల నా కరిగాఁపులుగా నొనర్చి పెక్కు జన్నంబులు నాచేఁ జేయించె. అతనికన్న సుగుణంబుల మిన్నలైన పాండు కుమారుల నెట్లు పాపనేర్తు? ఈ దుర్విచారంబు వల దుడుగుమా” అనఁ దండ్రికి సుతుం డిట్లను.

“పైతృకరాజ్యలక్ష్మిని పాండుభూపుండు తాల్చుటం జేసి యతని తనయులు దాల్చినఁ బదపడి వారి తనయులు నాపై వారి వంశీయులును వసుమతీశ పదవి కర్హులగుదురు. మే మిప్పుడు తప్పిన మా వంశమెల్ల రాజపదవికిఁ దప్పు. నీ కొడుకుల మేలు సూడఁగోరితేని తమ్మునిపైఁ దమ్ముని సుతులపైఁ గల మమతను బాఱఁదోలుము. వారిని వారణావతంబునకుఁ బనుపుము. క్రమాగతంబై ప్రజానురాగంబు మన యెడ మఱలు. మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱి వార లిందులకు వత్తురు”

అనిన సుయోధను మాటలకుఁ బుట్టుగ్రుడ్డి యొడంబడి పాండవులం బిలిచి వారణావతంబునకుఁ బొమ్మని యాజ్ఞాపించె. అదివఱకు దుర్యోధన ప్రేరితులై తన్మంత్రులు ధర్మజునొద్ద వారణావతంబును గూర్చి వివిధవిధంబుల వర్ణించుచుంటం జేసి పశుపతి నివాసంబును క్షాళితపాప భంగ గంగాతీరంబును నగు వారణావతికింబోవ సమకట్టిరి.

## —:లాక్షాగృహము:—

దుర్యోధనుండు పురోచనుం బిలిచి "నీవు నాకుఁ బరమవిశ్వసనీయుండవు. వాయుజవంబులైన వేసడంబులఁ బూన్చిన యరదం బెక్కి వారణావతంబునకు నేఁడ చని లాక్షా సర్జక రస సమ్మిశ్రంబైన ఘృత తైలార్ద్రంబైన మృత్తికాపుంజంబున నొక చతుశ్శాల విశాలంబుగా మనోహరంబుగా నవిరళ సుధాధవళంబుగా నాయుధాగార సమీపంబున రచియించి యందుఁ బాండవుల నునిచి వారలేమఱి మఱచి నమ్మి కొండొక కాలంబుండ నిన్నొరులెఱుంగకుండ నిమైన యవసరంబున ఘోరానలంబు దరికొలిపి పగఱ పంచత్వం బెఱిఁగిర" మ్మని పంచిన, వాఁడును వారణావతంబున దుర్యోధను కఱపిన రూపంబున లాక్షా గృహరచనంబు సేయుచుండె.

పాండవుల పయనమ్ము సూచి పురంబున గుసగుసలు పుట్టె. ఏలొకో పాండుపుత్రులు వారణావతికిఁ బయనించి

రనువారును, అంధరాజేల యిట్లాజ్ఞాపించె ననువారును, భీష్మాదులైన నేల వలదనరైరనువారును, రాజ్యంబపహరింప నీ బుద్ధి వాడమెనోకో యనువారును, ధర్మాత్ములగు కౌంతేయులతో మనముం బోదమనువారునై యెల్లరు పయనించిరి. వారలనెల్ల ధర్మజుండు మెత్తనిమాటల నూఱార్చి క్రమ్మరించి పెద్దల యనుజ్ఞఁగొని తల్లితోఁ దమ్ములతోఁ బయనించె. భీష్మాదులు కొంతవఱకుఁ దోడుచని మఱలిరి. విదురుఁడు మఱికొంత దూర మేగి దుర్యోధనాదుల దుర్మంత్రంబు లెఱింగినవాఁడు గావున నితరు లెఱుఁగని విధంబున మ్లేచ్ఛభాషలో ధర్మజున కిట్లనియె.

"కుమారా! రాజు లాశాపాశబాధితులు. నీతిజ్ఞుఁడు పరేంగితజ్ఞుఁ డాత్మానుసారి విచారితపూర్వప్రారంభకార్యుం డాపదలని స్తరించుకొనఁగలఁడు. ఒక్కొకపుడు ప్రభువులకు నలోహనిశితశస్త్రములనుండి శరీరరక్షణంబు కర్తవ్యంబగు. కుశాగ్రబుద్ధియగువాఁ డలోహజంబును శత్రుదత్తంబును నగు నాయుధంబుననే శత్రునిబర్హణంబుసేసి యాత్మరక్షణంబు నొందఁగలఁడు. అట్లొనర్చువాఁ డాత్మతోఁ బంచపీడల నొనర్చుట సమంజసంబు. అడవియెల్ల దావాగ్నిదగ్ధమయినను బిలంబున నుండు మూషికంబు సులభంబునఁ దప్పించుకొనఁగలదు. కనులు లేనివాఁడు దిక్కును దారిని గానఁడు. ధృతిలేనివాఁడు విభూతిం బడయంజాలఁడు. తిరిగిన

వాఁడు దారి నెఱుఁగు. నక్షత్రగతి నెఱుఁగువాఁడు దిక్కె-ఱుఁగు. ఇది విజ్ఞులమతము. ఇంతలి రహస్యమెఱిఁగి జాగరూకుఁడవై వర్తిల్లుము" అని ప్రబోధించి మరలె.

ఫాల్గుణ శుద్ధాష్టమి రోహిణినాఁడు పార్థులు వారణావతముం జేరిరి లక్క-యింట విడిసిరి. విదురు నుపదేశంబు ధర్మరాజు తమ్ములకు విస్తరించి చెప్ప వారుగ్రులై యిప్పుడ పోయి యా నీచులఁ బరిమార్త మనిరి. కాని ధర్మజుని శాంతవచనంబుల నోర్పునొంది యిందుండి తొలఁగుద మనిరి. "మనము తొలఁగిన మనలరోసి దుర్యోధనుం డపాయంబు సేయు. అది వినరాదు ఎఱిఁగి రేని కురుకుల సముద్ర క్షోభంబగు. మన మింద యుండి పురోచను వంచించి మనము దీని రగుల్కొల్పి వెడలవలయు" నని ధర్మజుం డవరజులకుం దెలిపి పవలెల్ల నడవులకుఁ జని వేఁటమిషంబున మార్గంబు లరయుచుండిరి. విదురుని పంపున నొక్క ఖనకుండు చనుదెంచి లక్కయింటికి నడవినడుమకు నొక సొరంగంబు త్రవ్వి యది భీమున కెఱింగించి బహుళ చతుర్దశినాఁటికిఁ బురోచనుండు లక్కయింటిని దహించు. మీరప్రమత్తులరై యుండుఁడని హెచ్చరించి తన త్రోవం బోయె.

కృష్ణచతుర్దశినాఁడు వారణావత ప్రజలకెల్ల గొప్ప విందు జరుపఁబడియెను. పురోచను పనిచిన నిషాదవనిత యొకత యేవురు తనయులతోఁ గుంతిని తనయులను బ్రతి

దినము సేవించుచు వారి కృత్యంబు లెఱింగి పురోచనునకుం జెప్పుచుండునది నాఁటి యుత్సవంబునఁ గొడుకులతో మిక్కుటంబుగ మద్యము సేవించి మత్తుమెయి నొడలెఱుఁగక నిదురించుచుంట మారుతి యెఱింగి పురోచనుకంటె మున్న తానుత్సహించి వాని శయనగృహద్వారంబునకు దహను దరికొలిపి యన్నను దల్లిని దమ్ములను బిలంబునకనిచి యాయుధాగారంబుతో లాక్షాగృహంబును హుతాశనున కశనంబు గావించి ఖనకునితో విదురునకుఁ దమ కుశలంబుఁ జెప్పి పంపి తల్లిని సోదరులను బిలంబు వెలువరించికొని చనుచుండు నెడ వారలు నిద్దురచేఁ గాళ్లు తడబడ నడువనేరక తడవుచున్నఁ గని తల్లిని మూఁపున ధర్మజ ధనంజయుల భుజంబుల యముల నుత్సంగంబున నెక్కించికొని పగటి పూట నడిచిన వడువునఁ జీఁకటియనక ముండ్లు గండ్లు మిట్ట పల్లములనక పఱచు రయమునఁ దరువులు సాలుగ మ్రొగ్గఁ బదఘట్టనంబున తాలుపిండిగాఁగ సత్త్వంబు మెఱసి నెఱయు రాతిరెల్లఁ జనియె. పగలగుడు భాగీరథి నుత్తరించి దక్షిణాభిముఖులై పాండవులు మార్తాండ మరీచి గోచరంబుగాని గహనంబున నరుగుచు నధికక్షుత్పిపాసా పరవశులై నడవ నోపక యున్న నందఱ నెప్పటియట్ల యెత్తికొని వడముడి కడువడిం జని యొక్క వటమహీజాత శీతలచ్ఛాయాప్రదేశంబున వారి నునిచి దాని యగ్రవిటపంబెక్కి నీరారసి దిగి

సమీపస్థ సరోవరంబునకుఁ జని యందుఁ గృతావగాహనుండై నీరాని యచ్ఛిద్రకమలపత్త్రపుటికల నీరంబుగొని శ్రమ్మతి వచ్చునంతఁ దమ్ములతేఁడు పశ్చిమాద్రి విశ్రమింపఁ దన తమ్ములు నన్నయుఁ దల్లియు నవ్వట విటపిక్రిందఁ బయిపుట్టంబులు పఱచికొని బాహుదండంబులు దలగడలుగా నిడికొని నిద్రితులైనవారిం గని "యక్కటా! ఎంతవారి కెంతలయ్యె! నీచులగు సుయోధనాదుల వలన నింతపుట్టెఁ గదా! కులపాంసనులైన యహితంబు లాచరించు బందుగులఁ బొందక గ్రామస్థితైక వృక్షముపోలె దూరగతుఁడగువాఁడ యుత్తముఁడు.

క. పరహిత ఫలవంతులు సు
స్థిర మూలాన్వితు లపార ధీయుతులు పర
స్పర సంశ్రయమున జీవిం
తురు మనుజులు వనములోని ద్రుమములపోలెన్"

అని ధృతరాష్ట్రు బంధుత్వంబు గర్హించుచు నిబిడాంధకార నీరంధ్రంబైన దిశలు సూచుచుండె.

బుగ్గియైన లక్కయింటిని పౌరులు వెఱగందిచూచి యందుఁ జచ్చి మసియైన నిషాదుల నార్గురఁ గుంతీయుత పాండవులనుగా నిశ్చయించి వగచిరి. ధృతరాష్ట్రుండు పాండవుల పంచత్వంబునకు పెల్లుగ దుఃఖించి యపరక్రియలఁ గావించె. విదురుండు నెఱుఁగనివాఁడుపోలె నటించె. దుర్యో

ధనుండు పాండవుల వలని భయము నేఁటితోఁ దీఱెఁగదా యని లోలోన సంతసిల్లుచుఁ బురోచనుని చావునకుఁ బైపై విలపించె.

—:హిడింబ వధ:—

అటఁ బాండవులుఁ దల్లియు నిద్రించుచుండ భీముఁడు వారిం గాఁచియుండె. తత్సమీపంబున బాలలతా తరుషండ మండపంబున నుండి హిడింబుఁడను నొక రక్కసుండు నిక్కి చూచి లేచి మైవెంచి రూక్షకేశంబులువిదిర్చి యావులించి నీల్గి నీరస వన్యమృగమాంసఖాదన జాత నిర్వేదనపరుండ నయిన నాకుఁ బెద్దకాలంబునకు మనుష్యమాంసం బాస్వాదింపఁ గలిగెనని యుల్లసిల్లి చెల్లెలి హిడింబ యను దానిం బిలిచి "వంటయింటికిఁ గుందేటిరాకయుం బోలె నెవ్వరో మన వనంబునకు మనుజులు వచ్చినవారలు. వారిం గొని తెచ్చి నాకు వండిపెట్టు" మన నా రక్కసి త్వరితగతిం జని యొక తరువు మఱువునఁ గొండొక ప్రొద్దు నిలిచి బృహద్వక్షుఁ బుండరీకాయతాక్షు సింహసంహనను బాండవసింహుని భీముఁగని మనోజాత వేదనంబొంది కుంది మర్త్యస్త్రీరూపంబు నొంది మరున్నందనుఁ గదిసి నిజభ్రాతృ నియోగంబు త్యజించి తన వృత్తం బావన్తంతం బతనికి వినిచి నన్నుం జేకొని నీ సోదరులఁ దల్లిని గాఁచికొని యిష్టోపభోగంబుల సుఖింపుము. వీరల బోధింపు మనవుడు భీమసేనుండు వెడ

నవ్వి నవ్వి "యో రక్కసి! ఎట్టి కష్టుఁడేని యన్నదమ్ములఁ దల్లిని విడిచి చపలసుఖంబున కాసించునె? వీరల బోధింపు మంటివి!

ఉ. క్రచ్చఱ నొక్క రక్కసుఁడ
కాఁడు సురాసురులెల్ల నొక్కలై
వచ్చిన నీవఁచూడఁగ న
వార్య బలోద్ధతిఁ జేసి వారలన్
వ్రచ్చి వధింతుఁగాక యిట
వచ్చి శ్రమంపడి యున్నచోటనే
నిచ్చగ వీరి కైన సుఖ
నిద్రకు భంగము సేయ నేర్తునే?

వలతేని నీ యన్న నిటకు రావింపు" మనుచున్నంత హిడింబ మనలుటకుఁ గ్రుద్ధుండై హిడింబుండు పండ్లు గొఱుకుచుఁ బఱతెంచి కామరూపిణియై భీమునితో సామోక్తులాడుచున్న చెలియలిం గని యుదరి పలుక నది యదరిపడి వెఱచఱచి మారుతి మఱుపుసొచ్చె.

"మీ యన్నను నన్నుఁ జూడుము. భయంబడకుము. మజ్జననిని సోదరులఁ గాఁచియుండు" మని హిడింబకు భీముండు దెలిపి తను బోడువఁ గడఁగి వడివడిఁ జేసఱముసాంచు వచ్చు హిడింబుని చేతితో నట్టె యొడిసి పట్టి తనవారికి నిద్రాభంగంబు గాకుండఁ దొలఁగ నీడ్చి

కొనిపోయి యొక్క ముష్టిఘాతంబున సంధులు ప్రిదులఁ బొడిచిన నప్పొలసుదిండి బీరువోవక రోదోంతరపూరితం బుగ బొబ్బరించె. అమ్మహాధ్వని విని కుంతియుఁ గొడుకులును మేల్కాంచి యతి మానుషంబైన రూపసౌందర్యంబుతో నున్న హిడింబ వలన యావద్వృత్తాంతం బరసి యర్జునుం బంపిరి. అతఁ డన్నయున్న నెలవున కరిగి నిశాచరుతోఁ బోరుచున్న యన్నం గని "మహాబలనందనా! రాక్షసవేళ యయ్యె. కాలయాపన చేయుచుంటి వేల? నీ లావునకు వీఁ డొక లెక్కయే?" యనుడు మల్లవిద్యావిశారదుండగు భీముండు రెట్టించిన బలంబున విజృంభించి యప్పిశితాశిం బట్టికొని ముక్కున వాతనెత్తురు వరదవాఱ నూఱుమాఱులు పీచి నేలఁబెట్టి కోలెముక మోఁకాట నూఁది త్రొక్కి పెళ్లున విఱిచి విగతజీవుం జేసి విసరివైచె.

ఆ చిత్రవధం జూచి చిత్రీయమాణచిత్తులై భీముం బొగడుచు నందఱు హిడింబానుగమ్యమానులై యరుగుచుండిరి. హిడింబ రాక కొడంబడక కరువలిపట్టి "నిన్ను విశ్వసింపము. నీవును మీ యన్న తెరువునం బొ" మ్మనిన నది వడవడ వడంకె. వధ కర్హుఁడై వచ్చినవానిఁ జంపఁ దగుఁ గాని యబలను భీతచిత్తను జంపఁదగదని ధర్మజుండు వారించె. హిడింబ కుంతి మఱువు సేరి తన యవస్థయెల్ల వెడలించుకొని నే నతీతానాగత వర్తమానంబుల నెఱుం

గుదు. వలసినచోటికి కెల్లర నశ్రమంబున నెత్తికొని పోయెద. ఇతనికై నా వారి విడిచితి. నన్నొల్లకున్నఁ బ్రాణంబు లొల్లనని పలికిన నామె నంద రాదరించిరి. కుంతి భీమసేనుం గని "నాయనా! ఇది పరమసాధ్వి. నన్ను మీ యన్నను గనియైన దీని కొడఁబడుము. పుత్త్రాభ్యుదయ మగువఱకు దీని వదలకుంట కార్యం" బని యొడంబఱిచె. కొన్నినాళ్లకా దంపతులకు భీమరూపుండగు ఘటోత్కచుండు పుట్టె. అగ్రనందనుం డగుట నందఱు వానియెడఁ బ్రేమాడిం జూపిరి. కతిపయదినంబులకా ఘటోత్కచుండు తండ్రులకు నమస్కరించి యిఁక నా యిమ్మల నుండెద. పనిగల యప్పుడు తలంచినఁ దత్క్షణంబ వచ్చెదనని వారి యాజ్ఞగొని తల్లిం దోడ్కొని యుత్తరాభిముఖుండై యరిగె.

—:ఏకచక్రపురము:—

వ్యాసు నిదేశంబునఁ బాండవులు బ్రాహ్మణవేషధరులై బ్రహ్మచారివృత్తిం దల్లితో నేకచక్రంబను నగ్రహారంబు సేరి యందొక విప్రునింట నిలిచి భిక్షంబునఁ గాలము గడుపుచుండిరి. ఒకనాఁ డొక్కపెట్ట నా పాఱునింట నార్తధ్వని యెగసిన విని కుంతి యెంతయు సంతాపించి మారుతిం గని "కుమారా! ఇంతకాల మితని యింట నొరు లెఱుఁగకుండ సుఖంబుగ నుంటిమి. ఇతనికిఁ బ్రత్యుపకృతి యెప్పు డొనర్తుమా యని యోజించుచుంటి నేఁ డెద్దియో దుస్తర

దుఃఖం బీ గృహస్థున కయ్యెఁ గావలయు. నా మనంబు మల మల మఱఁగెడిని. వారికిఁ దోడరిన యెడరు నడగించి మనఃప్రియంబు సేయుదు.

క. కృతమెఱుఁగుట పుణ్యము స
న్మతి దానికి సమము సేఁత మధ్యము మఱి త
త్కృతమున కగ్గలముగ స
త్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్"

అనిన నా పలుకులకు పవననందనుం డుల్లసిల్లి తల్లీ! వారికైన కీడరసి రమ్ము. నివారించి ప్రియంబుసేయుదు ననిన నా యమ వారియెడకుఁ జని దుఃఖకారణం బడుగ నా గృహమేధి యిట్లనియె. "సంసారం బసారంబు. అఖిల దుఃఖావహము భయనికేతనము. చంచలము. కావున నే తత్త్వజ్ఞులు నమ్మరు. సంయోగవియోగంబులు దేహికి దేహంబుతోడ ననుభావ్యములై వచ్చు. ఒం డెడకేగుద మన్నఁ గర్మవిపాకం బేల గడవనిచ్చు? ధర్మచారిణి వినయవతి ప్రజావతి యనువ్రతయగు సతి నెట్టు లసుర కాహారముగఁ బంతు? కన్యాదానఫలంబు దౌహిత్రలాభంబుఁ బోఁద్రోసి యిబ్బాల నెట్లు పుత్తు? కులవిస్తారకు నౌర్ధ్వదైహిక క్రియానిధిని జిఱుతవాని నదయత నయ్యసురవాత నెట్లుద్రోఁతు? నేన పోవు టుచితంబు"

అంత నతని భార్య యిట్లనియె.

నాథా! పడయందగు నపత్యంబు నా యందుఁ బడసితిరి. ఏనును ఋణవిముక్తనైతిని. పతి హితంబే పతివ్రతలకుఁ గర్తవ్యంబు. ఏ నవశ్య మా రక్కసున కశనం బయ్యెద. మీ రేగిన నన్నును బిడ్డలను గాఁచువా రెవ్వరు? అన్యదారపరిగ్రహణ యోగ్యులరైన మీరు నిలుచుట కర్జంబు.

వారి పలుకులు విని కుమారి యిట్లను.

ఎన్నాళ్ళుండిన నేను బరులసొత్తునుగాని మీ దానఁ గాను. ఒరుల కిచ్చుదాని నసుర కిచ్చిన వచ్చులోటేమి? మఱియుఁ దండ్రి చేయు తిలోదకదానవిధులు పరలోకగతమైన పుత్త్రిం జెందుఁగాని పుత్త్రి సేయు విధులు తల్లిదండ్రులఁ బొందనేరవు. నా యందుఁ గలుగు దౌహిత్రలాభంబుకంటె మీ రిద్దఱు జీవించి బహు పుత్త్ర పౌత్త్రలాభంబునఁ గులంబు వర్ధిల్లఁజేయుఁడు.

అనిన కూఁతుఁ గౌఁగిలించికొని యిరువు రేడ్చుచుండ బాలకుం డొక కోలఁ గొని నేనా రక్కసు నీ కోలతోఁ గొట్టి చంపెద. మీ రేడ్వకుఁ డని తన తొక్కుపల్కు లొప్పారఁ బల్కుచు నూరార్చె. వాని యవ్యక్తవచనంబుల కంద ఱేడ్పుడిగిరి. అంతఁ గుంతి వారలఁ జేరం జని మీ వగపులకు మొద లెయ్యది? నా కేవురు పుత్త్రులు గలరు. అందొకని మీకు మాఱుగ నిత్తునన వారలు

చెవులు మూసికొని హరిహరీ! ఎంతమాట! బ్రాహ్మణ హత్య మా మెడఁ గట్ట వలవదు తల్లీ!

క. ధృతిసెడి వేఁడెడువానిని
నతిథిని నభ్యాగతుని భ క్తి యుక్తుని శరణా
గతుఁ జంపుట కొడఁబడు దు
ర్మతి కిహముం బరముఁ గలదె మదిఁ బరికింపన్.

అనతిక్రమణీయంబైన మా యాత్మవధ మహాపాతకకారణంబు వినవలతేని వినుము. బకుఁడను రక్కసుండు తొల్లి యీ ప్రోలం బాడుసేయుచున్న నూరి పెద్దలు వానిం బ్రార్థించి యిల్వరుస నొక్క మానిసి రెం డెనుఁబోతులం బూన్చిన శకటంబున నపరిమిత భక్ష్యపిశిత మిశ్రాన్నంబు నించికొని పోయిన దానిని వాని నయ్యెనుఁబోతులను వాఁడు భక్షించి క్రమంబు దప్పక మమ్మితరభయదూరులఁ జేసి కాఁచు. ఇది కారణంబు. నేఁడు మా యిలువరుస యనినఁ గుంతి నవ్వి భూసురవర్యా! శతపుత్త్రులు గల ధన్యులకైన నభీష్టుండగు తనయుఁ డుండునే? నా కొడుకుచేఁ దొల్లి పెక్కం డ్రసురు లుక్కడఁగిరి. అని భీముం బిలిచి వీఁడు మహాబలసంపన్నుండు. మంత్రసిద్ధుండు. రాక్షసుం జంపి మీకు మేలుసేయంగలఁడు. సర్వము సిద్ధముసేయింపుఁడన వా రామె మాటలు నమ్మి మోదమందిరి. పదపడి ధర్మజార్జున నకుల సహదేవులు తల్లితో

"నో వెఱ్ఱితల్లీ! నీకు భీముఁడుంట భారమయ్యెనే? ఎవ్వని పేరు విన్నఁ గౌరవులకు భయాతిరేకంబున నిద్దుర రాదో యట్టి మరున్నందను రక్కసు వాతఁ ద్రోయ సాహసింతువే? నీకు దుఃఖాతిశయంబున మతిభ్రమ జనియించెనే?" యనుడు నాయమ "కుమారులారా! నే నంత వెఱ్ఱినే? కన్న కడుపనగు నా కంటె మీకు వడముడియెడఁ బ్రేముడి మెండయ్యెఁగా? అతని నే నెఱుఁగక పనుతునే? వీఁడు పుట్టిన పదియవనాఁడు బెబ్బులి బొబ్బరింతకు నే దద్దరిల్లి జాఱవిడువఁ, బడినవడిం జేసి యితని యొడలు దాఁకి ఱాల్లెల్లఁ బొడియయ్యె. వీఁడు వజ్రకాయుండు. వీని కొరు లపాయంబు సేయఁజాలరు. విప్రసాహాయ్యంబు మన కవశ్యకర్తవ్యంబు. వానికై సంతాపింపకుఁడు. రెండు విధములఁ గీర్తియ" యని భీము సాగనంపె. తక్కిన వారును దల్లి కారుణ్యంబునకు నుబ్బి భీమునకుఁ బ్రోత్సాహంబు గల్పించిరి.

—:బక వధ:—

వాయుపుత్త్రుఁ డానాఁడు బ్రాహ్మణునింటఁ గడుపారఁ గుడిచి బండిఁదోలుకొని మెల్లనఁజనుచు నాగ్రిశుష్కకళేబర మాంసదుర్గంధ నిందితంబయిన బకస్థానంబు డాయఁక యమునా తీరంబున నిలిపి రక్కసుం బిలుచుచు వాఁడు వచ్చునంత కూరకుండనేల యని బండిలోని యన్నంబు దినుచుండె.

చాల ప్రొద్దయ్యె నిత్యమిటకుఁ దెచ్చి యిచ్చు నన్న
మీనొల్లక యెఱుఁగిచ్చుచున్న నరాధముఁ డెవ్వఁడు? ఏక
చక్రపురవాసులకుఁ గ్రొవ్వెక్కెఁగాఁబోలు నని పెను రోషం
బున బకుఁడు శకటంబు డాయఁ జనుదెంచి తన కూడు
నెంగిలిసేయు వాయుపుత్త్రుఁ గని నేనింత యెల్లిదమైతినే
యని పిడికిట వీఁపునఁబొడిచె. అందులకు భీముఁ డించుకైనఁ
జలింపక యోరీ! నేను నీ కాహారమగునప్పుడు నీ యన్నంబు
నేఁదిన్న నదియు నీ యుదరమందే చేరుచున్నదిగదా! తొం
దఱ పడెదేల? ఇంచుక తాళుమని యెప్పటిపని యొనరించు
చుండె. దానికి బకుండు మండిపడి పిడితీరు వేయుచు విశాల
సాలం బొండొడిసి పెఱికికొని భీముం బాఁదవచ్చె. అంతలో
భీముండును నన్నంబంతయు ముగించికొని యనంతబలుండై
యంత్యకాలకాలుండుఁ పోలె రేఁగి మల్లసఱచు చుబకు నెదురనిలిచి,

ఉ. ఇంచుకయేని పాపమున
కెన్నఁడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్యమాంసములు
దించును గ్రొవ్వితి వాని నెల్లఁ గ్ర
క్కించెద నీ మదాంధ్య మడ
గించెద నిప్పుడ కాలుప్రోలి కే
గించెదఁ జక్కనై నిలుము
గిట్టి రణంబున రాక్షసాధమా.

అనుచుఁ దలపడియె. కొంతసేపు వృక్షములతోఁ బోరిరి. సమీపస్థ ద్రుమములు సమయఁగా శిలలతో నుప్పఁకొనిరి. శిలలును జిక్కకపోఁగా బక వృకోదరులు మల్లయుద్ధ సన్నద్ధులై యొండొరుం బట్టుచుఁ గొట్టుచు నీడ్చుచుఁ ద్రోచుచుఁ బరస్పర జయకాంక్షులై పెనఁగునెడ వడముడి యప్పొలసుదిండిం బడవైచి వామపాదమున వాని ఱొమ్ముఁదాఁచె. వెంటనే యా తుంటరి రక్కసుఁడు లేచి భీమునిఁబట్టి త్రోచి వక్షము దృఢతరముష్టిం బొడిచె. అప్పు డానిశాచరు హీనసత్త్వుఁగా నెఱింగి గాడ్పుకొడుకు హస్తిహస్తానుకారంబులైన సవ్యదక్షిణకరంబుల నమ్మనుజ కంటకు కటికంఠ ప్రదేశంబులు వట్టికొని జానుదండంబున నవ ద్వారంబులఁ బిశితంబుతో రుధిరధారలు బోరన నొల్క వాని పృష్ఠభాగంబు విఱుగంబొడిచిన వాఁడు మహాక్రందనంబుసేయుచు మడిసె. బకునివార లా ధ్వని విని పఱతెంచిన భీముండు వారిం గని యిద్దురాత్మునట్లు మనుజాశనులై తిరయేని వానిగతియ మీకునిక్కువంబన నా రక్కసులు భీము భీమాకారకృత్యంబులకు భీతులై యతని సమయంబున కొడంబడిరి. అనంతరంబు పవమానసూనుండు బకుని కళేబరంబు నీడ్చికొనివచ్చి యేకచక్రనగరద్వార సమీపంబునఁ బడవైచి విప్రులకు సంతోషంబుసేసి తల్లికి సోదరులకుఁ దద్వృత్తాంతంబంతయు వినిచి ప్రమోదరసాబ్ధిసుస్నాతులం గావించె.

—:అంగారపర్ణుండు:—

మరలఁ గొన్ని దినంబులు గడచినపిదప నొకనాఁ డొక పుడమివేలుపు పాంచాలపురంబునుండి యరుగుదెంచి పాండవులున్న భూసురునింట నతిథిపూజలంది ప్రసంగవశంబునఁ బాండవులు లాక్షాగృహంబున దగ్ధులగుటం జేసి పార్షతుండు తన పుత్త్రికి స్వయంవరంబు రచియించుచున్నవాఁ డనినఁ గుంతియు ధర్మజుండు నతనివలన వారి యుదంతంబా తయు నాలకించి కొమరుల నభిప్రాయం బెఱింగి కుంతిభోజపుత్త్రి యా యింటివారికిం జెప్పి వారి సెలవుఁ గైకొని పుత్త్రులతోఁ బయనించి యనేక నదీనద వనదుర్గంబులు గడచి చనుచుండఁ బరాశరాత్మజుం డెదురుపడి కరుణారస పూరితాంతఃకరణుండై మీరు ద్రుపదు పురంబునకుఁ బొండు. మీకు లగ్గగునని చెప్పి చనియె. పార్థు లటనుండి పోవుచు రాత్రియగుడుఁ బ్రకాశార్థంబు రక్షణార్థంబుగా నొక్క కొఱవి చేతఁ బట్టికొని యర్జునుండు దారిచూప నందఱు నరుగునెడ నంగారపర్ణుండను గంధర్వుఁ డంగనాసహితుండై గంగకు జలక్రీడలాడవచ్చి పాండవుల పాదధ్వని విని యలిగి విల్లుగొని గుణధ్వనిసేసి "యెవ్వరావచ్చువారలు? తొలఁగి పొండు. కుబేరసఖుం డంగారపర్ణుం డంగనలతోఁ గ్రుమ్మరు నియ్యెడకు రాఁదగదు. వచ్చిన నెడరు దొడరుసుమా!"

యనియె. "అడవులు నేఱులు త్రోవలు సర్వజన సామాన్యంబులగుఁ గాని నీయవి యెట్లగు?" అని యర్జునుండుత్తర మీయ నా గంధర్వుఁ డమందరోషుండయి యర్జునుపయి నిశితనారాచములఁ బఱపె. దాని కర్జునుఁ డలిగి తన చేతి కొఱవి ద్రిప్పి యయ్యస్త్రంబులు దప్పించుకొని "యోరి మూఢా! నీవిభీషికలు మాయెడఁజెల్లునే?" యని తనచేతి కొఱవి నభిమంత్రపూర్వకంబుగ వైచిన దాన వాని తేరు దగ్ధంబై వాని మేను చుఱచుఱఁ గాఁడిన వాఁడు బమ్మరిల్లి నేలకువ్రాలె. వాని సిగఁబట్టి యీడ్చి తెచ్చి ధర్మరాజు ముందట నిలిపె. వానిభార్య కుంభీనసభీతచిత్తయై కరుణామయి యుధిష్ఠిరుఁ బతిభిక్ష వేఁడిన నతఁడు వాని విడిచి పుచ్చె. నిర్జితుఁడైన యంగారపర్ణుం డర్జునుతో సఖ్యంబు చేసి సర్వంబును జూడ సమర్థంబైన చాక్షుషివిద్య నర్జునున కుపదేశించి యతనివలన నాగ్నేయంబు వడసి వలసినప్పుడు చెఱి నూఱుగంధర్వహయంబుల నిచ్చెదఁ గొనుండని పలికి మీకగ్నిహోత్రంబును బ్రాహ్మణసంగ్రహంబును లేమిం జేసి నా పలికిన పరుసంబులు మనంబుననిడవలదని ప్రార్థించి యిచ్చోటికిం గుఱంగటనుత్కచంబను పుణ్యతీర్థంబున ధౌమ్యుం డను భూసురుండు గలఁ డతని నర్థించి పురోహితుగాఁ బడసిన మీకు సర్వార్థసిద్ధియగుఁ బొండని తన యనుఁగు కాంతలతో గంధర్వుండు నిజలోకంబునకేగె.

—:యంత్రమత్స్యభంజనము:—

ఆపైఁ బాండవులు ధౌమ్యుం బ్రార్థించి పురోహితునిగా నియ్యకొలిపి యతనితో నా త్రోవను బాంచాల పురికిఁ బోవు భూవిబుధులఁగలిసి పాంచాలముం జేరి యొక్క కుంభకారగృహంబున విడిసిరి.

ద్రుపదుండు పార్థునకుఁ గూఁతునీయ సమకట్టి పాండవుల నన్వేషించి యెందుఁ గానక యంత్రమత్స్యంబు నొక యున్నతస్తంభంబునకు వ్రేలఁగట్టి దానిం బడగొట్టువారికిఁ దన కన్య నిచ్చి పాణిగ్రహణంబు సేయుఁ దునని చాటించె. ఆవార్త విని ద్రౌపదీరూప మోహితచిత్తులై రాకుమారు లందఱు విచ్చేసి తత్తదుచితాసనంబులఁ గూర్చుండిరి. పాండవులును గుర్తింపరాక బ్రాహ్మణమధ్యంబున నాశీనులై యుండిరి కృష్ణయుఁ గరంబున గుసుమమాలికం ధరించి చెలుల మధ్యంబున నిశ్చలంబైన క్రొక్కారు మెఱుంగు తెఱంగున నిలిచియుండె. ధృష్టద్యుమ్నుండు సభామధ్యంబున నిలిచి రాజలోకంబుం గాంచి "యిమ్మహాధనువును సజ్యంబుచేసి దిగువనుండు జలంబులఁ బైనున్న మత్స్యంమును గుఱిచేసి యైదు బాణంబులతో మధ్యఁ దిరుగుచున్న చక్రంబున సమ్ములు దాఁటి యంత్రంబును భేదించి తన్మత్స్యంబు నీ గంధపాత్రయందుఁ బడనేసినవారికి నా యీ చెలియలు భార్య గాఁగలదు. శూరులు తమ కార్ముక

కౌశలంబుఁ బ్రకటింప నిది తరుణంబు. యశమును గల్యాణంబును సిద్ధం" బని చాటి చెప్పి తనచోటికిఁ దరలె.

రాజకుమారులు పెక్కండ్రు ద్రౌపదిం గని చలితచేతస్కులై తమ్ముఁ దమ సామర్థ్యంబు లెఱుంగక యర్థిత్వంబున నవ్విల్లు మోపెట్టఁబోయి యొంతగఱచి నీల్గి విల్లు వంపనేరక లజ్జా లలనామోహితులై యాదలలువంచి మరలిరి. వృష్ణిభోజాంధకులు కృష్ణానుమతంబున ననారబ్ధులైరి. శిశుపాల జరాసంధ శల్య కర్ణులు దర్పించి తమ లావు మెఱసి క్రమంబున నలువురు మాషయావ మద్గతిలమాత్రంబులు దక్కువగాగ నయంబువంచి గొనయం బెక్కించియు నెక్కుపెట్ట నశక్యంబైన నుక్కుసెడి స్రుక్కిరి.

పలువు రిట్లు పరిభవభాజను లగుచుండఁ బార్థుండు సూచి యగ్రజ ననుమతంబున విప్రసభ వెలువడి ధనుస్సమీపంబున కరిగె. విప్రులు తెస్సదిని యొడలఁబట్టక నిట్టి పనికిఁ బూనెనని కొందఱును, మనల గేలిసేయ నితఁడు వచ్చెనని మఱికొందఱును, ఈ మహాధను వతనికి మతిభ్రమణంబునఁ బిండివంటగాఁ గన్పట్టెఁ గావలయునని వేఱొక కొందఱును, నితని యొడలి జాడలఁ గన మహీసురుని వైఖరి గన్పట్టదని యొక కొందఱును బరిపరివిధములఁ బరిహాసవచనంబు లాడుచుండిరి. వారి మాటలఁ బాటింపక ఫల్గునుం డమ్మేటి వింటి సమీపంబునకుఁ బోయి గురు

వులకు నమస్కరించి ధనువునకుఁ బ్రదక్షిణించి మ్రొక్కి పుచ్చికొని పూర్వపరిచితంబైన విల్లు నల్లశ్రమంబున మోపెట్టి యేనమ్ముల నమ్మత్స్యయంత్రంబు నురలనేసి సదస్యుల నాశ్చర్యరసనిమగ్నులం జేసెను. ద్రౌపది తదితర రాట్కుమారులు నిరాశతోఁ దన్నుఁ జూచి గుటకలు మ్రింగుచుండ నర్జునుని కంఠంబుఁ దన చేతి పూలమాలతో నలంకరించెను. అప్పటి సభాస్థితిం గని ధర్మజుండు నకుల సహదేవులతోఁ దన విడిదికిం జనియె.

దుర్యోధనాదు లసూయాగ్రస్తులై సహింపనేరక కలయఁబలికికొని చెలరేఁగి "యీ మదాంధుఁడు ద్రుపదుఁడు రాజులనెల్ల రాఁ బనిచి జాలవిద్య యొంతు వన్ని కన్నియను జన్నిగట్టున కిచ్చె. ఇందు బ్రాహ్మణుని తప్పేమి గలదు? వీనిం బట్టి బంధింపుఁడని మూఁగిరి. ద్రుపదుఁ డర్జును మఱువు సేరె. బ్రాహ్మణవర్గం బర్జునునకు సాయంబై తమ జందెంబుల నవలగ్నంబులకుఁ జుట్టి వల్లెవాటుల బిగించి దండాజినంబులెత్తి ప్రతిబలంబులపై నీవ వారలం జూచి నగుచు విజయుండు వారించి మదీయాస్త్ర పటుమంత్రంబుల రిపునృప విపాహుల దర్పం బుడగింతునని రిపుబలంబుపై నంపవాన గురిసె. వృకోదరుం డొక్క వృక్షంబు వెఱికికొని శత్రుసమూహంబుల బారి సమరఁ దొడఁగె వారి సంరంభంబు చూచి యిదేమి యాగడం

బని రాజులు పిక్కబలంబు చూప మొదలిడిరి. తొలఁగక యోహటించి కర్ణ శల్యులు విజయ భీమసేనులం దాఁకి నొచ్చిరి. కర్ణుఁ డర్జునుం గని "విప్రవర్యా! నాతో నని సేయ భార్గవునకు శివునకు విజయునకుఁ దక్క దక్కుంగల వారికి దరమ్మగాదు. నీ నేర్పునకు మెచ్చితి. నీ వెవ్వం డవు?" అన నర్జునుండు చిఱునగవునఁ "గానీనా! వీరిలో నే నెవ్వాఁడఁగాను గాని విన్ననిలో నోర్వ నుర్విం జనించిన వీరుండ. చక్క నిలు" మనిన బ్రాహ్మణతేజం బజేయం బనుచుఁ గర్ణుండు తొలఁగి చనియె. భీముఁడు శల్యుం బట్టి యెత్తి నేలకు వైచిన నతఁడుఁ ద్రెళ్ళి లేచి యొడలు దుడిచికొనుచుఁ దిరిగిచూడక మరలె.

ఆ. వె. పరశురాముఁడొండె హరుఁడొండె నరుఁడొండెఁ
గాక యొరులుగలరె? కర్ణుగెలువ
బలిమి భీముఁడొండె బలదేవుఁ డొండెఁగా
కొరులు నరులు శల్యు నోర్వఁగలరె?

వీ రెవ్వరో యెఱుఁగరాదు. అని దుర్యోధనాదులు విస్మితులై తమ తమ దేశంబులకు మరలిరి. భీమార్జునులు ద్రౌపదిం దోడ్కొని తమ విడిదికిం జనిరి.

—: కృష్ణావివాహము :—

కొడుకులు పెద్దప్రొద్దురాక తడసిరని యెదురుచూచు చున్న తల్లియొద్దకు మున్నుగ ధర్మజ నకుల సహదేవు లరు

డెంచిరి. అవల భీమార్జును లేగుదెంచి "జననీ! మే మొక్క భిక్ష గొనివచ్చితి" మన నా యమ యెప్పటియట్ల కాఁదలచి "మీా రేవురు నుపయోగింపుఁ" డని పదపడి వారి పజ్జనున్న కన్నియం జూచి లజ్జించి యధర్మభీతయై ధర్మజు నుద్దేశించి "కుమారా! యేల యిట్లంటివి? పృథ వచన మెన్నఁడు వృథయైనదిగాదు. ఇపు డెట్లొకో!" యనినఁ దల్లి నూరార్చి ధర్మరా జర్జునుం గని "యనుజా! నీచేఁ బడయంగఁబడిన దీని నీవ యగ్నిసన్నిధిఁ బరిగ్రహింపు" మన నతం "డన్నా! పెద్దవాఁ డుండఁ గొంఠొకవాఁడు పెండిలియగుట ధర్మ విరుద్ధంబగుఁ గావున నీవ దీని నగ్రమహిషిగా గ్రహింపు" మనియె. ఆ సమయంబున విధిప్రేరణంబునంజేసి నలువుర మనంబు లామెయందు లగ్నంబులయ్యె. అది యెఱిఁగి యుధిష్ఠిరుండు "తమ్ములారా! వేదవ్యాస వచనానుసారంబు నను, జనని వచస్సరణి నిది మన యేవురకును బత్ని గాఁ దగు" ననియె.

అత్తఱుణంబున రామకృష్ణు లట కరుదెంచి కుంతికి ధర్మజునకు మ్రొక్కి తక్కినవారిం గౌఁగిలించికొని మీాకు లగ్గయ్యెడు మనిరి. మమ్మెట్లెఱిఁగితిరని ధర్మరాజడుగ మీా పరాక్రమంబ మిమ్మెఱిఁగించెనని వారి యనుమతి వడసి రామకృష్ణు లరిగిరి.

ద్రుపదుండు ధృష్టద్యుమ్నుం బిలిచి కూఁతు వడుఁ డెవ్వఁడో యెట్టివాఁడో వానిచరిత మెట్టిదో యెఱిఁగిరమ్మన

నతఁడు రహస్యప్రకారంబునఁ గుంభకారగృహంబున కరిగి నాఁటిరాత్రి వారిచర్యలెల్ల గమనించి తండ్రియొద్ది కరుదెంచి “జనకా! వా రేవు రన్నదమ్ములు తల్లితో నున్నవారు. వారి పలుకులజాడఁ జూడ బ్రాహ్మణులని తోఁచు” చేష్టలు చెయివులు యోజనలుచూడ క్షత్రియులని తోఁచు” ననిన నింక నిమ్ముగ నెఱుంగఁగోరి పురోహితుంబంచె. అతండును వారి కడకేగి పూజితుఁడై మీ కులగోత్రనామంబు లెయ్యవియో మా రా జెఱిఁగి రమ్మనియె నన ధర్మజుండు సుందరమందహాసరోచులు మొగమున నిగుడ జగతీసురున కిట్లనియె.

“వైహాయసలక్ష్యం బెవ్వఁడేసిన నతండ తన పుత్రికిఁ బతియని మీ నరపతి నియమముసేసె. ఇతఁ డట్టు లయ్యంత్రమేసి యిక్కన్యంబడసె. ఇఁక మమ్మెఱిఁగి యతఁడు చేయఁగలదేమిగలదు? అల్లునకు నకృతాస్త్రునకు నయ్యంత్రము నేయ నలవియే? ఇంతయేల? మీ రాజు కోరిక సఫలంబయ్యె [illegible] మనుము”

అంతఁ పురోహితుఁ డా వచనంబుల భూరమణునకుం జెప్పె. మఱియు రాజు చాతుర్వర్ణ్యోచితంబులయిన స్యందనంబులఁ గొనిపోయి వారలఁ దోడ్కొనిరమ్మని ధృష్టద్యుమ్నుం బంచిన నతండు వానిం గొనిపోయి రాచనగరికి విచ్చేయుఁడని బ్రాహ్మణవేషులఁ బ్రార్థింప వారలు వల్లెయని కుంతీ ద్రౌపదుల నొక్క రథం బెక్కించి తామును రాజోచితంబులై

రత్నాంచితంబులైన రథంబు లెక్కి రాజమందిరంబునకు వచ్చుచుండిరి. ద్రుపదుండు వారల కనేకవిధ వస్తువు లతి ప్రీతిం బుత్తెంచినఁ బదార్థ్యంబులఁ గైకొనక సాంగ్రామికంబులఁ గైకొని యరుదెంచి క్షత్రియోచితాసనంబులఁ గూర్చుండిరి. వారిని రాజపుత్త్రులఁగా శంకించి యజ్ఞసేనుండు సంశయాపనోదనపరుండై ధర్మతనయుంగని "మీ రెవ్వరు? క్షత్త్రియులరో బ్రాహ్మణులరో మాయావులై క్రుమ్మరుచున్న మంత్రసిద్ధులరో కన్యాపరిగ్రహణార్థంబు దిగివచ్చిన దివ్యులరో యెఱుంగము. మీ కల రూపెఱుంగికాని యిక్కన్యా వివాహంబు సేయనేరము" అనిన నతనికి ధర్మజుం డిట్లనియె.

క. క్షత్త్రియులము పాండుప్రియ
పుత్త్రుల మే నగ్రజుండ ♦ భూనుతులు మరు
త్పుత్త్రార్జునయము లమల చ
రిత్త్రులు నలువురును వీర ♦ రిందము లెందుక్.

ఇయ్యామ మజ్జనయిత్రి కుంతీదేవి యనవుడు ద్రుపదుం డతి హర్ష రసావేశపరవశుండై పెద్దయుం బ్రొద్దునకుఁ దెలిసి యానందజలభరిత నయనుండై మజ్జన్మపరిపాకపుణ్యం బెట్టిదియో లాక్షాగృహదహనంబునం దప్పితిరని తద్వృత్తాంతం బంతయు విని విదురుం గొనియాడి ధార్తరాష్ట్రుల నిందించి నా కుమారిత కర్జునుఁ దల్లుఁడగుటకు నింద్రపదము సేకూరి నంత సంతసించితినన ధర్మజుండు మే మేపురము నీయల్లుం

డ్రమ యని తమ యభిప్రాయం బెఱింగించె. పార్షతుండు విస్మితుండై యొక్కనికిఁ బెక్కండ్రాండ్రగుట గలదు గాని యొక్కర్తుకకుఁ బెక్కండ్రు మగండ్రగుట ధర్మవిరుద్ధంబు గదా! నీవు ధర్మాత్మజుండవు. లౌకిక వైదిక ధర్మవేదివి. నీ వెఱుఁగని నీతి నిర్ణీతి గలదే? అశ్రుతపూర్వంబగు దీని నింకను విచారింత మనుచుండునంత వేదవ్యాసుం డయ్యెడ కరుదెంచి జటిలా దాక్షాయణీచరిత్ర లుపదేశించి ద్రౌపదికిఁ దొలిబాముసంగతి నాలాయని చరిత్రంబును బాంచేంద్రోపాఖ్యానంబును వివరించి యిక్కార్యం బవశ్య కర్తవ్య మనియె.

దైవాధిష్ఠితంబని ద్రుపదుఁ డొడఁబడి నాఁడే శుభ ముహూర్తమని యెఱిఁగి నిశ్చయించి రౌద్రి పుష్యశుద్ధైకాదశీ రోహిణీ బుధవారమున ద్రుపదుండు కూఁతుఁ గృష్ణను సారిదిగ ధర్మజ భీమార్జున నకుల సహదేవుల కిచ్చి మహా వైభవంబుతోఁ బెండ్లిసేయించె.

నాఁటికి ధర్మజుని వయస్సు ముప్పదియేఁడులు నేడు నెలలు. భీమార్జును లతనికంటె నొక్కొక యేఁడు తక్కువ వారలు. కవలు విజయునికంటె నొకయేఁడు పిన్నలు.

—:దుర్యోధనాదుల దురాలోచనలు:—

పాండవులు ద్రుపదునింటఁ జాలకాలంబు సమస్త సౌఖ్యంబు లనుభవించుచుండిరి. దుర్యోధను వేగులవారిది

గ్రహించి తమ యేలికకు సర్వంబును విన్నవించిరి. అది విన్న సుయోధనుండు లో నెఱియుచుఁ బలుకులఁ బెక్కు-విధంబుల వారి చెఱుగు దలపోసి తండ్రితో నాలోచింపఁ దరుణము వేచియుండె. ఇట్లఁ జెప్పిన నగుసేగి యేదియు లేదని విదురుండు ధృతరాష్ట్రునకుఁ బాండవాభ్యుదయంబును బాంచాలి లాభంబును నెఱింగించిన నతండు సంతసిల్లి విదురునకు మనఃప్రియంబుగాఁ బాండవులఁ బొగడి యంతిపురికేగి కొడుకును రప్పించె. దుర్యోధనుండును గర్ణ శకుని దుశ్శాసనులతోఁ దండ్రిసన్నిధి కేగుదెంచి తన్నెఱిఁగించి నమస్కరించి యిట్లనియె. "తండ్రీ! విదురుఁడు పాండవహితుఁడని మున్న యెఱింగియు నతని వచనములతి వ్యామోహమున సమ్మతించుచుందుము. నీతో నేదేని రహస్యము లాలోచింపవలయు నన్న నొకప్పుడును విదురునివిడిచియుండవు" అనిన తనయునకు జనకుండిట్లను.

"కుమారా! పలుకులఁ జేష్టలఁ బాండవుల హితము కోరినట్లు నటింతుఁ గాని నిజమునకుఁ గాదు. నా హృదయంబు నెన్నఁడు విదురున కెఱిఁగింపను. ఎల్లప్పుడు నేను మీవలెఁ బాండవులయెడఁ దలంచుచుందును. దైవబలంబు గలవారి నేమిసేయనగు? పై పై విదుర వాక్యంబు లంగీకరించుచుందుఁ గాని నా యంతరంగం బావంక ప్రాలదు. నీ కెద్ది యిష్టంబు? చెప్పుము చేయుదము"

నావుడు దుర్యోధనుం డిట్లను.

"పాండవు లిప్పుడు దైవబలంబుతోడ బంధుబలం బెక్కువ గలిగి యున్నారు. పాండవ పాంచాలురకు భేదము గలిగింపవలయు. నొండెం బాండవుల కేవ్వర కొక్కర్తు భార్యయై యుంటం జేసి వారిలో వారికే విరోధంబులు పుట్టింత మొండె నుపాంశు ప్రయోగంబున భీముం జంపించి తక్కినవారల బలహీనులం జేయుదము' దుర్యోధను పలుకు లాలించి కర్ణుం డిట్లనియె.

"లేక లేక కలిగిన పాండవుల సంబంధము ను బాంచాలుం డేల విడుచు? పాండవు లేకపత్నియందుం గరమనురక్తులగుటచే వారికి భేదంబు వాటిల్లదు. తొల్లి మీ చేసిన యుపాంశు ప్రయోగంబుల భీముం డేమయ్యె? కావున విక్రమంబు ప్రయోగించుట కార్యంబు. చతురంగ బలసాధన సంపన్నులమై పాంచాలు భంజించి పాండవుల దిక్కు లేనివారినిగం జేయుదము"

వారి పలుకులు ధృతరాష్ట్రుం డాకర్ణించి "మీ యాలోచనలు తగియున్నవి, ఐనను మతిమంతులతో విచారించి చేయుద" మని భీష్మ ద్రోణ విదుర కృపాశ్వత్థామ సోమదత్తాదులం బిలిపించి యంతయు నెఱింగించిన భీష్ముండు దుర్యోధనున కిట్లనియె.

"కుమారా! మీరును బాండవులును నా కొక్క రూపువారలు. కాన విగ్రహంబున కే నొప్పుందు నొడంబడ. పితృపైతామహంబైన రాజ్యంబునకు మీ యట్ల వారు నర్హులు గావున నర్థరాజ్యంబు పంచి యిచ్చుట మీకును బంధువులకును లోకంబులకు హితంబు. కాని నాం డపకీర్తి సిద్ధంబు. కీర్తిలేనివాని జీవనంబు నిరర్థకంబు"

భీష్ముని వచనంబులకుఁ దోడుగ ద్రోణుం డిట్లనియె.

"దుర్యోధనా! ధర్మవర్తనులగు పాండవులతో విగ్రహ మేల? కర్ణాదుల పలుకులు విని చెడవలదు. పెద్దల మాట లాలింపుము. భీష్ము ననుసరింపుము" అనినఁ గర్ణుండు లేచి "ఈ ముదుసలులు తమ కనుకూలముగఁ జెప్పికొందురు గాని నృపతి హితంబు నూహింపరు. విరోధుల పొత్తున మనుమని యెదరు. తొల్లి నితంతువను రాజు రాజ్యతంత్రంబు నంద సమర్థుండై యున్న నాతని మంత్రి యేక ప్రధానుండై క్రమక్రమంబున నతని రాజ్యవిభవంబెల్లఁ జేకొనియె. కావున మంత్రులు హితుల పోలె నహితం బాచరింతురు" అనుచుండ నడ్డువడి భీష్మద్రోణులు "ఔరా! ఈ సూత పుత్త్రుండు కౌరవ వంశోద్ధారకుండు. మేము కౌరవవంశ నాశకులము. నీని బోధలచేఁ గౌరవకులం బాకులతఁ బొంద నందియుం బేమిఁగలదు?" అనిన వారల వారించి విదురుండు ధృతరాష్ట్రుం గని "భీష్మ ద్రోణుల కంటె నీకుఁ

గూర్చువారు గలరే? బాలుర పలుకులు నీవు వినఁదగదు. ఒండనక పాండవులఁ బిలిపించి యర్ధరాజ్య మిమ్ము. పాండుపుత్త్రులు నీ పుత్త్రులుగారె? వారి రాజ్యాధికారులఁ జేయ నీకుఁ దగవే? పాండునృపాలుని వలనఁ గాదె నీ కీ మహీమండలంబు విస్తరించె. వారలు నిన్నతి భక్తిం గొలువరే? దీని కింత యోజనలేల? వారితో విగ్రహం బాచరించి వంశనాశమ్ము గావించుకొందువేల? వారి పరాక్రమంబులు దృష్టపూర్వంబులు. నీ పుణ్యంబున నమ్మహాత్ములు లక్కయింటం బ్రదికిరి. నీ యందా పురోచనకృతంబైన దుర్యశః పంకంబుఁ బాండవానుగ్రహ జలంబులఁ గడిగికొనుము" అనిన ధృతరాష్ట్రుండు మాఱుపలుకఁజాలక యర్ధరాజ్యం బీయ సమ్మతించి పాండవులం దోడితేర విదురుం బంచెను.

—: రాజ్యభాగము :—

పాండవుల రాకకుఁ బౌరలోకంబు కరంబలరె. మహోత్సవంబుతోఁ బార్థులు కరిపురంబు ప్రవేశించిరి. ఐదేండ్లు కౌరవ పాండవులు కలిసి మెలసి యుండిరి. ఒకనాఁడు ధృతరాష్ట్రుండు పెద్దలయెదుట ధర్మజు నర్ధరాజ్యంబున కభిషిక్తుం జేసి ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముగా మీ తండ్రి విభవంబు ననుభవింపుఁ డనియె. గురుల యనుమతంబునఁ బాండవులు ఖాండవప్రస్థమ్ముఁ జేరిరి. శ్రీకృష్ణుండు వారి యెడ కరుగుదెంచి కొన్నినాళ్లుండి యింద్రం

బిలిచి విశ్వకర్మచే రమ్యంబగు పట్టణం బొండు నిర్మింపఁ గోరె. విశ్వకర్మ పాండవుల పరిపాలనమ్మునకు వివిధోప భోగవాసమ్ముల కనుకూలమ్ముగ నొక పురంబు నిర్మించె. అయ్యదియు యింద్రప్రస్థమ్ము నాఁ బరఁగె.

క. ధరణిఁ బ్రజ ధర్మసుతు సు
స్థిర నిర్మల ధర్మచరితఁ జేసిరుజాత
స్ఫుర పరరాజుల బాధల
బొరయక సంతతసమృద్ధిఁ బొందె విభూతిన్.

కొన్నినాళ్లు పాండవులతో సంతోషంబుండి వారల వీడ్కొని కృష్ణుండు ద్వారావతి కరిగె. తరువాత నొక్క నాఁడు వీణాగాన విశారదుండగు నారదుండు పాండవుల యొద్దికి వచ్చి యర్ఘ్యపాద్యాది షోడశపూజలంది పెక్కు నీతులు వారలకు బోధించి మఱియు నిట్లనియె మీరు ద్రౌపది విషయంబున నొక్కసమయంబు చేసికొని పరస్పర వైషమ్యంబు లొందనీక వర్తించునది కార్యంబు. తొల్లి సుందోపసుందులు ఘోరతపంబున విరించను మెప్పించి కామరూపత్వ కామగామిత్వ సకల మాయావిత్వంబులను నన్యులచే నవధ్యత్వంబును వరంబులుగాఁ బడసి లోకంబు లాకులపాటు గావింపఁబూనిన సురల ప్రార్థనంబున మరలఁ బరమేష్టి తిలా సుమణికోటి సంఘటిత దివ్యదేహంబుతోఁ దిలోత్తమయను యువతీలలామను సృజించి వారలయెడకుఁ

బంపె. వార లిరువురు నామెయం దనురక్తులై మా యిద్ద ఱిలో నెవ్వని వలతువని యక్కలికి నడిగిరి. ఆతిలోత్తమ మీ యం దెవ్వఁ డతిలోకశూరుఁడో వానిన వలతునని వా రిరువురుఁ దమలోని స్నేహభావంబుఁ బోఁదోలి కొండ కొండ దాఁకినట్లు తాఁకి పోరి యిరువురొక్కసారిగ మడిసిరి.

క. ఇంతులనిమిత్తమున ధృతి
మంతులు వొందుదురు భేద కమతి గావున మీ
రింతయు నెఱింగి యొండులు
చింతింపక సమయమిందుఁ జేయుఁడు బుద్ధిన్.

అనిన నారదు వచనంబులు చేకొని తమలోఁ దా మొడఁబడి "ద్రౌపది యొక్కొక్క యేఁ డొక్కొక్కని యింటఁ గ్రమంబుగనుండు. ఎవ్వనియింట ద్రౌపదియుండు నయ్యింటిదెసఁ బెఱవారు సనకుందురది. ఎఱుఁగక సనిరేని యొక్క యేఁడు తీర్థయాత్ర సలుపుచు విశిష్టవ్రతంబులఁ గాలంబు గడుపువారలు" గా సమయంబు సేసిరి.

తన హితోపదేశంబు ఫలియించుటకుఁ బ్రీతచిత్తుండై విధాతృపుత్త్రుండు వారి వీడుకోలువడసి తనత్రోవం బోయె. కొండొక కాలంబునకు మ్రుచ్చులచేఁ దన హోమధేనువుం గోలుపోయిన యొక భూసురుండు వచ్చి యాక్రోశించిన మున్నెన్నఁడు విననిపుట్టి యాక్రందనంబు విని విజయుండు విస్మితుండై విప్రునకైన యాపద దీర్పమి ధర్మవిరుద్ధంబని

యాయుధాగారంబున ద్రౌపదీద్వితీయుఁడై ధర్మరాజుండుట నటకుఁ బోఁబోలమి నెఱింగియు విప్ర నార్తరవంబు విన నొల్లక నిజశరాసన గ్రహణార్థ మటకేగి పుచ్చుకొని త్వరిత గతిం జని చోరుల వధించి పుచ్చి బ్రాహ్మణునకు గోధనంబు నొసంగి క్రమ్మఱవచ్చి తన యుదంతంబంతయు నన్నకు వివరించి మర్యాదాభంగ దుర్యశంబునకుఁ బ్రాయశ్చిత్తంబుగ ద్వాదశమాసిక వ్రతంబునకు సెలవిమ్మనిన నతం డిట్లనియె

దుర్జనవధంబు గోబ్రాహ్మణహితంబున నీకు దుర్యశంబు లేదు. మఱియుఁ జలితమానసంబునఁ జనుదెంచిన వాఁడవు కావు. సమయభంగ భీతి వలదు. సమయోల్లంఘన ప్రాయశ్చిత్తంబు సేయనేల? యనిన నర్జునుం డిట్లను.

—పార్థు తీర్థయాత్ర:—

అన్నా! 'యథా రాజా తథా ప్రజా' యన వినవే! భూజనపరివాదం బవ్యాజంబునఁ బరిహరింపవలయుఁ గాక సమర్థవాక్యంబులచేఁ జనదు. నన్నను గ్రహింపుమని మ్రొక్కి-యతని వీడ్కొని గురుజనానుమతుండై వేదపారగులైన మేదినీసురులతోడఁ బయనించి పెక్కు తీర్థంబుల సేవించి గంగాద్వారంబుఁ జేరె. అందుఁ గ్రుంకులిడి వేల్చుచున్న సవ్యసాచింగని యులూపి యను నాగకన్య యతనిం దన సౌధమునకుఁ గొనిపోయె. తొంటియట్ల వ్రేల్మికుండం బెదుర నుండ నర్జునుం డగ్నికార్యంబు సమాప్తిగావించి చెంతనున్న

యయ్యింతిం గని "నీ వెవ్వతవు? నన్నేల గొని తెచ్చితి. తీర్థవాసిని వ్రతినైన నా యెడ నిట్లేల వ్యామోహితవైతి" వన నప్పాఁపచెలువ "విజయరాజేంద్రా! కౌరవ్య కొమిరెను, ఉలూపి యనుదానను. చాలకాలమునుండి నిను విని పంచశరు శరవిద్ధనై నా పుణ్యవశంబున నేఁడు నినుఁ గని గొని తెచ్చితి. మీా సమయంబును భవత్తీర్థాగమన నిమిత్తంబును నే నెఱుంగుదు. సర్వవ్రతఫలంబులు తీర్థసేవనంబులు సకలదానక్రియలు ప్రాణదానంబుతో సమంబుగావను టీ వెఱుంగవే! నా మనోరథంబు విఫలంబైనఁ బ్రాణపరిత్యాగంబు సిద్ధంబు. దీన నీకు వ్రతభంగంబు గానేర" దని యర్థించినఁ గాదనఁజాలక దాని మనోరథంబు సఫలంబుసేసి యిరావంతుండను కొడుకుం బడసి యులూపి సెలవంది మఱునాఁడరుణోదయంబునకు గంగాద్వారంబు సేరవచ్చి తన వృత్తాంతంబు నేలవేలుపులకుఁ జెప్పి యటనుండి కదలి దక్షిణదిశాభిముఖుండై మధ్యఁగల పుణ్యనదుల నాలయంబుల రమ్యవనంబుల విచిత్రవస్తుజాలంబులఁ గనుచుఁ గావేరిం జేరి సేవించి మణిపురంబున కరిగి చిత్రాంగదుఁ డను రాజుచేఁ బూజితుండై తత్పుత్త్రిం జిత్రాంగద యనుదానిం బరిణయంబుగా నపేక్షించిన యతని యభిప్రాయం బాప్తుల వలన నెఱింగి చిత్రాంగదుం డిట్లనియె.

పాండవులతోడి బాంధవ్యంబు పరమసంతోషదాయకంబు. అందు విశేషించి యర్జునుఁ డల్లుఁడగుట యన

మా భాగ్యవిశేషంబుఁ జెప్ప నలవియే? అయినను మాకుఁ గల కోరిక యెఱింగింతుము. తొల్లి మద్వంశ్యుండు ప్రభాకరుఁడను రాజపుత్త్రుండై పరమేశ్వరు నుపాసించి మా వంశంబు వారికెల్లఁ గులోద్ధారక కార్యంబున కొక్కొక పుత్త్రుండు గలుగునట్లు వరంబందె. అది మొదలుగ మదీయ వంశీయులకు నొక్క కుమారుండ జన్మించుచు వచ్చెఁ. నా యభాగ్యవశంబునఁ బుత్త్రిక జనియించె. దీనినే కుమారుగా భావించి పెంచితి. ఈమెయందు దుద యించు పుత్త్రుండు మా వంశ విస్తారకుండు గావలయు. ఇంతల కొడఁబడిన నీ యమఁ బెండిలి గావన్చును.

చిత్రవాహను వచనంబుల కొడంబడి పాండవమధ్యముండు చిత్రాంగదం బరిణయంబై కొన్నినాళ్ళచ్చటనుండి సమీపస్థ తీర్థసేవనంబు సేయుచు సౌభద్రతీర్థంబునకుఁ జని యందు స్నానంబుసేయ సమకట్టిన నందున్న మునులు వారించి "అయ్యా! ఇందుఁ బంచతీర్థము లున్నవి. క్రోల్మొసళ్ళుంటఁజేసి చొర నశక్యం" బనిన నరుఁడు సాహసంబున నా నీట దిగె. వెంటనే యందలి మకరంబు కవ్వడి కాలు వట్టికొనియె. దాని నా క్షణమ వింటికోపునఁ దజ్జలాశయంబు వెలువడ విసరివైచె. అది తటాలున నొక నుందరాంగియై "మహేంద్రనందనా! నా వలె శాపగ్రస్తలై యున్న మా చెలియండ్రు నలువురకు విముక్తిగలిగింపు" మని

ప్రార్థింప నట్లు కావించి సర్వజనావగాహంబునకు గ్రాహబాధ నివారించి క్రమ్మఱి మణిపూరంబునకు వచ్చి సుఖంబున నుండి బభ్రువాహనుఁడను తనయుం బడసి యతని మామకు వంశకరుఁగా నొసంగి యతని వీడ్కొని పశ్చిమసముద్రప్రాంత విషయంబులఁ జూచుచుఁ బోయి ప్రభాసతీర్థంబు గని యందుఁ గ్రుంకులిడి నిత్యకృత్యము లాచరించి యటకు ద్వారక చేరువయని విని మనమున "నేని ద్వారావతి కేగి శ్రీకృష్ణు సందర్శించి మజ్జన్మంబు సఫలంబు చేసికొనియెద. మున్ను గదునిచేఁ గృష్ణుని చెల్లెలు లోకసుందరి యని వింటి. అట్టి సుభద్రఁ జూచు పుణ్యంబు దొరకొనునే? మేనమఱఁది యగు మురాంతకు దయచే సుభద్రం జెట్టవట్టు భాగ్యం బబ్బునే? కృష్ణా! నా కేత్రోవ గల్పించెదవో!" అని తలపోయుచుండె.

క. నరమునికి నెఱిఁగి కృష్ణుఁడు
తిరముగ దయతోఁ బ్రభాస తీర్థమునకు నొ
క్కరుఁడ చనుదెంచె సర్వే
శ్వరుఁ డెప్పుడు భక్తులకుఁ బ్ర సన్నుఁడుగాఁడే?

తనయొద్ద కరుదెంచిన దేవకీనందనునకుఁ బురందరనందనుండు ప్రణమిల్లి కౌఁగిలింపఁబడి తీర్థసేవాగమనకారణంబుఁ దెలిపి యూరకున్న నర్జును సుభద్రయెడ బద్ధానురాగం బుపలక్షించి ద్వారకకుం దోడ్కొని చని యతివేషంబున రైవతకాద్రి గుహాయం దుంచి చనియె.

మఱునాఁడు ద్వారకావాసులకు రైవతమహోత్సవంబు. యతి సేవానియతికిఁ రేవతీపతికి నూతనయతి యున్న స్థలంబు కొందఱు చూపిరి. బలరాముఁ డతనికిఁ బ్రణతుండై సర్వతీర్థకీర్తనంబులు తత్సేవాఫలంబు లతని వలన విని చాతుర్మాస్యవ్రతమునకు రమ్మని యర్థించి పార్థుం దోడ్కొని యంతఃపుర ప్రాంత వనాంతరంబున నివాసంబు సేసి యతని కుపచర్యలు సేయ సుభద్రను నియమించె.

—:సుభద్రా వివాహము:—

సుభద్ర కృతక యతి కతిభక్తి నుపచరించుచు నర్జును నెడఁ దన విన్న లక్షణము లెల్ల నీ యతియం దుండుట గని యతఁడగు నొకో యని సంశయించుచు నొక దిన మతనిఁ జనవు పెంపున సమీపించి కూర్చుండి "యతీంద్రా! మీ రాడని తీర్థంబులు చూడని పురములు తెలియని నరవరులు లేరని విచారింతు. అమరావతి కెనయగు నింద్రప్రస్థమ్మున కెన్నఁడే నరిగియుంటిరే? పాండవులు సుఖంబున్నవార లే? మా యత్త కుంతి కుశలినియే? అద్దేవి తృతీయ పుత్త్రుఁడు మహావీరుఁడు విజయుఁడు తీర్థగమనోన్ముఖుఁ డయ్యెనని విందు. అతఁడు క్రమ్మఱవచ్చెనే? ఎఱుఁగుదు రేని వచింపుఁ" డన నర్జునుఁ డిది యదనని మొద నెంచి "ముగుదా! నాకు నర్జునునకు భేదంబు విచారింప వలదు. నీ కొఱకై యీ యర్జునుఁడు సన్న్యాసియై నీ కడఁ

గడు నిడుమలు గుడుచుచుండఁగ నికరంబునఁ గరం బనుగ్ర హింపక కాలంబు వృథసేయఁ దగవే?" యని యామె కరంబు పట్టి గాంధర్వంబునఁ బరిణయంబు గమ్మనిన లజ్జా వనత వదనయై సుభద్ర "నన్ను నీ నర్పా లిందయున్న వారలు. మిమ్మెఱిఁగి యుద్వాహంబు చేయఁగలరు. నన్ను విడు వుఁడు. అదిగో! నా చెలులు వచ్చుచున్నా" రన నరుండు తటాలున సుభద్ర కరంబు వదలె. ఆయమ శుద్ధాంతము నకుఁ జనియె.

సుభద్రార్జునుల యన్యోన్య ప్రణయంబులు పురు షోత్తముండు తన దివ్యచిత్తంబున నెఱిఁగి యర్జునునకు భోజనవిధు లొనరింప రుక్మిణిం బంచి వారి పరస్పర ప్రేమంబు బలరామునకుఁ దక్కఁ దక్కిన యెల్లరకుఁ దెలిపి మఱునాఁడు శివపూజామహోత్సవ వ్యాజంబున బలరామా దులతో నంతర్ద్వీపంబునకుఁ జని వా రెఱుఁగకుండ సుభ ద్రార్జును లున్నయెడ కరుదెంచి వసుదేవునిచే సుభద్ర నర్జు నునకుఁ గన్యాదానంబు సేయించి సంప్రాప్తమనోరథుండైన యయ్యతిరథశ్రేష్ఠుఁ గాంతా ద్వితీయుంబుగఁ గాంచనరథం బెక్కించి యింద్రప్రస్థంబునకుఁ జనుమని యుత్తరువిచ్చె.

సుభద్ర నేర్పున సారథ్యం బొనరింప విజయుండు రథ స్థుఁడై తమ్ము నడ్డగించిన పురపాలకులఁ బాఱఁదోలి యింద్ర ప్రస్థంబు సేరి తా నన్న యడుగుల కెఱఁగి సుభద్రను ద్రౌప

డికి నతులొనరింపఁ బంచె. పదపడి బలదేవుండు పార్థు దుష్కృత్యంబునకు మండిపడి సమరసన్నాహంబు సేయు నుంకించిన శ్రీకృష్ణుండు శాంతవచనంబుల నతనికోపంబు చల్లఁబఱచె. తర్వాత నందఱు వచ్చి నూతనదంపతులకు మహోత్సవంబులు సేసి యరణంబు లిచ్చి కుంతిచే ధర్మజుచే దీవనలంది మరలిరి. శ్రీకృష్ణుఁడు మాత్ర మచ్చటఁ గొంత కాలంబు నిలిచె. వివాహమైన తొలియేఁటనే సుభద్రా విజయుల కభిమన్యువను తేజశ్శాలియైన కొమరుండుపొడమె. పాండవులకుఁ గ్రమంబున ద్రౌపదియందుఁ బ్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులను నేవురు పుత్త్రులుదయించిరి. ధర్మరాజు వేదిక యను పత్నియందు యౌధేయుండను కొడుకుంగాంచె. భీముండు జలధర యను భార్య యందు సుగుణుండను తనయుం గనియె. నకులునకు రేణుమతి యను నిల్లాలియందు నిరమిత్రుండను పుత్త్రుండుపుట్టె. సహదేవునకు విజయ యను నర్ధాంగియందు సుహోత్రుండను సుతుండు గలిగె. ఇట్లు పాండవవంశం బభివృద్ధినొందె.

—:ఖాండవ దహనము:—

ఒక నిదాఘదినంబున నర్జునుండు కృష్ణుం గూడి రుచిర ప్రదేశంబుల విహరించుచు ఖాండవవన సమీపంబున నొక సుగంధలతాభవన చంద్రకాంత వేదికయం దాసీనులై మంద శీతల సురభి మారుతం బనుభవించుచు నిష్టకథా వినోదం

బుల నుండునంత పీతిహోత్రుండు విప్రరూపంబునఁ జను దెంచి వారల నతిభక్తిం బూజించి యే నమితభోజనుండ. తృప్తిగ నోగిరం బిప్పింపుఁడని వేఁడ నీ కెద్దియిష్టంబగు భోజ నం బనిన నతండు వారల కిట్లనియె.

నే నగ్నిహోత్రుండను. శ్వేతకి యను రాజర్షి శత వార్షిక సత్త్రయాగంబుసేయ సమకట్టి తగిన ఋత్విజు గానక యీశ్వరానుమతంబున నిరంతర ఘృతధారం జేసి నన్నుఁ దృప్తుం జేసిన పరమేశ్వరుండు కరుణించి దుర్వాసు నతని కార్త్విజ్యమ్ము సేయఁబనిచె. శ్వేతకి సంతత ఘృత ధారంజేసి యగ్నినైన నా కగ్నిమాంద్యమ్మును దానిచేఁ దేజోహీనతయు దప్పియు నైనఁ బితామహునిపాలికిం జని యతని వలన నీ వ్యాధికి దివ్యౌషధయుక్తమైన ఖాండవదా హంబు ప్రతిక్రియగా నెఱింగి మరలి యేడుమాఱు లివ్వ నంబుఁ గాల్పఁబోయి విఫలమనోరథుండ నైతి. మీ కృపా విశేషంబున నిక్కార్యంబు గావలయునని వేఁడెను. అర్జు నుఁడు తగిన కార్ముకముండిన నిన్నుఁ గాపాడఁగల మనియె. అంత నగ్ని వరుణుం దలంచి తొల్లి సోముఁడిచ్చిన బ్రహ్మ నిర్మిత కార్ముకమును నక్షయతూణీరములు గంధర్వహయం బులఁ బూన్చిన రథమ్ము నరునకు జక్రంబును గదయు నారా యణునకు నిమ్మనిన నతం డట్ల కావించె.

తదనంతరము కృష్ణార్జునుల యనుమతిఁగొని వైశ్వానరుండు ఖాండవదహనమ్మున కుపక్రమించె. ఇష్టసఖుండగు తక్షకు వలన ఖాండవమ్మునకైన యకాండ ప్రళయమ్ము విని త్వరితముగ ననేక వలాహక నివహంబుతో వచ్చి హుతాశనుమీఁద మహోవారి ధారలు గురియించె. చక్రియు గాండీవియు నిరువలఁకుల నిలిచి కాచియుండిరి. అర్జునుండు నానాకాండ సహస్రము లేసి యఖండ వారిధారలు దూఱకుండ ఖాండవమ్మునకు గృహంబుగఁ జేసె.

తక్షక తనయుఁ డశ్వసేనుఁ డనువాఁడు తల్లి తోఁక గఱచికొని తప్పించుకొని పోఁ బ్రయత్నించినఁ గవ్వడి యా తోఁకతోఁ దునిసి యగ్గింబడ నశ్వసేనుంగొట్టె. మోహిని యను మాయ గావించి యింద్రుఁ డశ్వసేనుఁ గాపాడి తక్షకుండు దగ్ధుండయ్యెనకా వగచి కడు నలిగి కృష్ణార్జునులతో ఘోరంబుగఁ బోరె. సురలు భీతిగలిగి పాఱఁ బార్థుఁడు భయంకరంబుగఁ గయ్యంబుసేసె. కొడుకు విక్రమమునకుఁ గడుంగడు సంతసించియు మఘవుండు వనంబు నార్పఁ బెక్కురీతుల నసిసేసియు జరుగుఁబాటు నేరక యూరక మరలె. కృష్ణార్జునులు సింహనాదంబులు చేసిరి. అయ్యవసరంబున నగ్నియు నచ్యుతుండును జంప వచ్చినఁ దప్పించుకొని నముచి దనుజు ననుజుండు మయుండను శిల్పి విజయు శరణంబు వేఁడె. శరణాగతరక్షణ తత్పరుఁడై నరుఁడు మయుని

గాచిపుచ్చె. అనలుం డప్పనదహనంబు సమాప్తి గావించి నీరోగుండై కృష్ణార్జునుల దీవించి చనియె. అతిమానుషము నత్యద్భుతము నతి దుష్కరము నైన ఖాండవదహన కృతికిఁ బార్థ జనార్దనుల గోపతి మెచ్చి సురపరివృతుఁడై చనుదెంచి యతి స్నేహంబునఁ గౌఁగిలించికొని యర్జునున కనేక దివ్యాస్త్రంబు లొసంగి యెల్లప్పు డితని కిష్టసఖుండవై యుండుమని కృష్ణు నర్థించి దివ్యవిమానా రూఢుండై దివిజాప్సరోగణ దిక్పాలక సేవితుండై దివంబున కరిగె. మయుం దోడ్కొని కృష్ణార్జునులు ధర్మజుకడకు వచ్చిరి.

—:సభాభవన నిర్మాణము:—

మత్ప్రాణరక్షణంబు గావించిన పరమోపకారుల కెయ్యది ప్రత్యుపకృతి యొనర్చువాఁడ. అనేకవిధ శిల్ప కళాదక్షుండ. మీ యభీష్టం బానతిండని మయుండు వేఁడినఁ బాండవు లుపేంద్రు మొగము సూచిరి. కృష్ణుండు పెద్దతడవు విచారించి యుధిష్ఠిరు వైభవంబున కనువగు దాని సర్వలోక సుందరమగుదానిఁ నొక సభామందిరంబు నీ శిల్పకలా కౌశల మేర్పడ రచియింపు మనియె. దేవతా విమానమ్ములఁ దిరస్కరించు దివ్యసభ నా నేర్పేర్పడ నొనర్చి యిచ్చెద. తొల్లి వృషపర్వుండను దానవేంద్రున కొక్క సభ నిర్మింప సమకట్టి సామగ్రి సమకూర్చి బిందుసరంబున నుంచినాఁడ. వానిం గొనితెచ్చి విచిత్రంబుగ నిర్మించెద

నని మయుండు పయనించె. కృష్ణుండును గాంతేయుల వీడ్కొని ద్వారావతి కరిగె.

మయుండు పూర్వోత్తర దిశాభిముఖుండై కైలాసంబున కుత్తరభాగంబున మైనాకశైలంబున హిరణ్యశృంగంబునం గల రత్నసంచయంబు సంగ్రహించి బిందుసరమునం దున్నవానిం గొనితెచ్చి మణిమయములగు దూలంబులు కంబంబులు జాంబూనద కుడ్యంబులు విచిత్రమణి ఖచితవేదికలు జనమనోహరంబులైన నానావిధయంత్రములు కుసుమఫల భరితములైన తరువనంబులు వికచకమల కుముదాభిరామంబులైన జలాశయంబులు మఱియుం బెక్కు చిత్రంబుల కాకరంబుగ విశాల సభా భవనంబు నిర్మించి ధర్మజున కొప్పించి పెనుగద యొండు భీమసేనున కిచ్చి శంఖంబు విజయున కొసంగి వారిచే సత్కృతుండై యరిగె. దైవజ్ఞ దత్త శుభముహూర్తంబున ధౌమ్యాది భూసురవర్యాశీర్వాద పుణ్యాహనాదంబు లెసంగ ధర్మజుండు తమ్ములతోం దనయులతో సభాప్రవేశంబు సేసె. మార్కండేయ మౌంజాయన మాండవ్య శాండిల్య మందపాలాది మహామును లా సభకు విజయముచేసి ధర్మజుచేం బూజితులై యిష్టకథాగోష్ఠులం బ్రొద్దుపుచ్చుచుండిరి.

మ. మదమాతంగ తురంగ కాంచన లస

న్మాణిక్య గాణిక్య సం

పద లోలిం గొని తెచ్చి యిచ్చి ముద మొ
ప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతు సీతనగ మ
ధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయుల్ ధర్మజుఁ డత్సభాస్థితు జగ
త్పూర్ణ ప్రతాపోదయుల్.

—:రాజసూయము:—

ఇట్లుండ నొకనాఁడు.

ఉ. నీరజమిత్రుఁడేల ధర
ణీగతుఁడయ్యెను నొక్కొ యంచు వి
స్మేర మనస్కులై జనులు
మెచ్చి నిజద్యుతి చూచుచుండఁగా
నారదుఁ డేగుదెంచె గగ
నంబుననుండి సురేంద్ర మందిర
స్ఫార విలాసహాసి యగు
పార్థగృహంబునకుం బ్రియంబునన్.

దేవమునికిఁ బాండవులు ప్రత్యుద్గమనులై నమస్కరించి తోడితెచ్చి యుచితాసనంబున నునిచి యర్ఘ్యగులు గడిగి పూజించిన నారదుండు వారల కుశలం బడిగి రాజధర్మంబు లుపదేశించి "యింద్ర యమ వరుణ ధనేశ్వర కమలాసనుల దివ్యసభలఁ గాంచితిఁ గాని యవి విభవ

సౌందర్యముల నీ సభకుఁ బురుడింపవు. ఇంద్రసభయందు మీ తండ్రి దివ్యభోగంబు లందుచున్నాఁడు. రాజసూయం బున నవభృథస్నాతులైనవా రింద్రసదృశ సురపూజ లందుదురు. మీ తండ్రి యయ్యాదంతంబు మీ కెఱింగించి రాజసూయంబు సేయఁ బ్రోత్సహింప నన్ను వేఁడుటం జేసి యియ్యెడ కరుదెంచితి.

క. న్యాయమున రాజసూయము
సేయుము నీ పితృవరుల కై జెచ్చెర నధిక
శ్రీయుత సురగణపూజ్యులఁ
జేయుము శక్రుసభనుండఁ జేయుము వారిన్"

అని యాదేశించి సురముని యరిగె.

పితృసంకల్పము నెఱవేర్ప సుతులకుఁ గర్తవ్యమని ధర్మజుండు ధౌమ్యాది హితవర్గంబుతో నాలోచించి తత్క్రతుకారణంబునఁ బ్రజాసంహ్రాతియుఁ గలుగు నని శంకించి వాసుదేవునితో యోజించి చేయుదమని జంఘాలురగు దూతల నచ్యుతుం బిలువఁబంచె.

దూతాసీతుండై యేతెంచిన పీతాంబరుఁ బ్రీతితో నర్చించి యనామయ ప్రశ్నానంతరంబు నారదాదేశం బెఱుక పఱచి యతని యభిప్రాయంబు దెలియఁగోరిన నతనికి హరి యిట్లనియె.

అరిసూదన వీర్యులగు ననుజుల సాహాయ్యంబున నీవు రాజసూయంబు సేయ నర్హుఁడవు. సర్వరాజుల జయిం

చినఁ గాని యాయ్యాది నెఱవేఱదు. ఇప్పుడు జగంబునఁగల సర్వ క్షత్త్రియుల జరాసంధుండు జయించియున్నవాఁడు. వాఁ డిప్పుడు గర్వితుఁడై రాజులఁ బెలుకుఱఁ బట్టి తెచ్చి బంధించి బలి యొసంగి భైరవపూజఁ గావింపుచున్నాఁడు. వానిం జంపిన జగంబులు తెలివొందు. సర్వ సామ్రాజ్య వైభవంబు నీకుఁ జేకురు. రాజసూయంబు నెఱవేఱు. క్షత్త్రియ నిగ్రహ మోక్షణఫలంబు సిద్ధించు. నా తోడ భీమార్జునులఁ బంపుము. నీ యాశీర్వాదబలంబున నన్నిచుఁ బీచ మణఁచు టెంతపని?

కృష్ణుని వచనంబుల కలరి యజాతశత్రుండు భీమార్జునుల నతని వశంబు సేసి కార్యసిద్ధి యయ్యెడుమని దీవించి పంపె. ధర్మజు నాశీర్బలంబున నా మువ్వురు వీర శ్రీవిభాసితముఖులై విప్రవేషధరులై చని గోరథం బను పర్వతం బధిరోహించి గిరివ్రజంబు గాంచి చైత్యకగిరి శృంగంబు చేరి యందున్న వింతవారిం గనిసంతఁ దమంత మ్రోగు భేరుల వ్రచ్చి యా ద్వారంబునఁ బురంబు సొచ్చి మాలాకార గంధకర గృహంబులకుఁ జని బలాత్కారంబునఁ బుష్పగంధంబులు గొని మాల్యాలంకృత మూర్తులై చందనాగురు భూషితవక్షులై బ్రాహ్మణులకు సుప్రవేశం బగు జరాసంధు మందిరంబు సొచ్చిరి.

మాగధుం డదు రేఁగుదెంచి మధుపర్కంబులీయఁ గైకొనరైరి. వారి గర్వంబు నభిప్రాయంబు లెఱింగి జరా

సంధుండు "దోర్దర్పమున భేరులు వ్రచ్చి మా ప్రోలుసొచ్చి స్నాతకవేషులై బలిమిని బుష్పగంధంబులు గొనివచ్చి నా యిచ్చు మధుపర్కంబు లేలయొల్లరు? మీ వేషంబులు బ్రాహ్మణత్వంబు నటించినను మహాసత్త్వ దీర్ఘబాహుపృథుల వక్షో లక్షణంబులు క్షత్త్రియత్వంబును జెప్పక చెప్పుచున్నవి. మీ రెవ్వరు. మీ కోరిక లెయ్యవి?" యనినఁ గృష్ణుఁ డతని కిట్లనియె.

మేము క్షత్త్రియస్నాతకులము. ద్వారంబున మిత్రనివాసంబును నద్వారంబున నమిత్రనివాసంబును జొచ్చుట క్షత్త్రకులవీరులకుఁ గర్తవ్యంబు. మేము నీతో యుద్ధంబు గోరి వచ్చిన కృష్ణ భీమ పార్థులము గావున నీ సపర్య లియ్యకొనకుంటిమి. మా ముువ్వురలో నీ కిష్టముగల వారితో మల్లయుద్ధంబు సేయు మిదియ నీ విచ్చు సపర్య.

జరాసంధుండు కృష్ణు మొగంబు సూచి నగి పదుమూఁడుమాఱులు పఱగెత్తిన పాఱుఁబోతుపందవు నీవు. అర్జునుఁడు పసివాఁడు. నా కెనయగు భీమునితోఁ జెనకువ యొనర్చెదనని సన్నద్ధుండై వచ్చె. భీముఁడును వానితోఁ బ్రతిఘటించి నిలిచి తలపడియె. పవలు పోరాడుచు రాత్రుల, విరమించుచుఁ బోరిపోరి తుదకు భీముండు జరాసుతు హీనసత్త్వం జేసి

క. వెఱచఱవఁ బట్టికొని వడిఁ
జఱచి జరాసంధునొడలి సంధులయెమ్ముల్
విఱిచి వధియించి యార్చెను
వఱలఁగ భీముండు భువన వలయంబద్రువన్.

తరువాత జరాసంధసుతునకు సహదేవునకుఁ దద్రా
జ్యంబు పట్టంబుఁగట్టి నిగృహీతులై యుండిన పుడమిపతుల
విడిచిపుచ్చి జరాసంధురథమ్మున నమ్మువ్వురునీరు లతిరయం
బున నింద్రప్రస్థమ్మునకుం జనుదెంచి ధర్మజునకు విజయ
వార్త యెఱిఁగించిరి. చెఱనుండి విడిపింపఁబడిన రాజులు
తమ తమ రాజ్యములకుఁ బోయి యపార ధన కనక మణి
భూషణాంబరములు గొనివచ్చి ధర్మజుఁ గొలిచి సేవించిరి.

తరువాత నన్నయానతిఁ దలఁదాల్చి భీముండు తూర్పు
నకును నర్జునుఁ డుత్తరదిశకును నకులుండు పశ్చిమంబున
కును సహదేవుండు దక్షిణదిక్కునకును దిగ్విజయార్థులై
బయలుదేఱిరి.

ఉత్తర కురుభూములు దాటి సర్వ ధారుణీశ్వరుల
వశ్యులఁ గావించికొని యపార ధనరాసులతో ధనంజయ
బిరుదాంకితుండై బీభత్సుండు మరలె. పూర్వదిఙ్మహీపతుల
నెల్లర నరిగాపులఁగాఁ జేసికొని మారుతి యేతెంచె. నకుల
సహదేవులు పశ్చిమ దక్షిణదిశల రాజుల లోఁబఱచికొని
విజయలక్ష్మీవిభాసితులై క్రమ్మఱిరి.

నారాయణుచే ననుజ్ఞాతుండై యజాతశత్రుండు రాజసూయంబున కుపక్రమించె. చతుస్సముద్ర ముద్రిత ధరావలయంబునఁ గల యిలాధిపతులెల్ల రేఁగుదెంచి ధర్మజున కపారంబుగఁ గానుక లర్పించిరి. బంధువులగు రాజులెల్లరు విచ్చేసిరి. కృతాకృత పరిజ్ఞానంబున భీష్మద్రోణులు దాన దక్షిణలఁ గృపాచార్యుండు సకల వస్తువ్యయంబున విదురుండు రాజులు తెచ్చిన యుపాయనంబులు చేకొన దుర్యోధనుఁడు భక్ష్యభోజ్యాది వినియోగమున దుశ్శాసనుండు నియుక్తులై తమ కార్యము లప్రమత్తులై నెఱవేర్చుచుండిరి. ధర్మజుఁడు దీక్షగైకొని యజ్ఞవేది కరిగె. బ్రహ్మవేత్తలగు ధౌమ్య పైల వ్యాస సుసామ యాజ్ఞవల్క్యాదులు హోతాధ్వర్య బ్రహ్మాది స్థానంబుల నియంత్రితులై నారదాది మహామునులు భీష్మాది రాజవరులు సదస్యులుగా సర్వక్రియాసమృద్ధంబై షడంగ సమగ్రంబై సంపూర్ణదక్షిణాసనాథంబై జగన్నాథరక్షితంబై సకలజనానంద కరంబై రాజసూయం బతి రమణీయంబై ప్రవర్తిల్లె.

భీష్ముఁడు ధర్మజుఁ గాంచి స్నాతకుఁడు ఋత్విజుండును సద్గురుఁడిష్టుఁడు భూతలేశుఁడు సంయతుఁడును బూజనీయులు. వీరిలో సద్గుణంబులతో నెవ్వఁడు పెద్దయగు నతని నొక్కని బూజింపుమన ధర్మజుం డట్టివాఁ డెవ్వఁ డెఱుఁగఁ బల్కుమన నతండు సత్సేవ్యుండు శ్రీకృష్ణుండుదక్క నొరులు

లే రతనిఁ బూజింపు మనియె. శాస్త్రోపదిష్ట విధానంబున యుధిష్ఠిరుం డచ్యుతుఁ బూజించె. అదిగని సహింపనోపక శిశుపాలుండు లేచి కృష్ణు నధిక్షేపించుచు ధర్మజున కిట్లనియె.

సీ. ఈతండు వృద్ధని ✱ యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ ✱ వసుమతీశ!
యాచార్యుఁ డని విన ✱ యమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ ✱ గృపుఁడునుండ
ఋత్విజుండని విచా ✱ రించి పూజించితే
ద్వైపాయనుండుండ ✱ ధర్మయుక్తి
భూనాథుఁడనియెడు ✱ బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే ✱ యవనిలోన
ఆ. వె. పూజనీయులైన ✱ పురుషులలోపల
నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ ✱ డిట్టులేల
పూజ్యులైనవారిఁ ✱ బూజింపనోల్లక
భీష్మపనుపుఁజేసి ✱ బేలవయితి.

నీ వెఱుఁగక యిచ్చినను దగుదునని యెట్లు కైకొనియె? పేడికిఁ గన్యాదానంబు క్రియఁ జెవిటికి మధురగీతిరీతిఁ జీకునకు సురూప దర్శనంబుకరణిఁ గృష్ణునకు నర్ఘ్యంబిచ్చి యజ్ఞవేది కలంకంబు గావించితిరని పెక్కువిధంబుల నిందించె. భీష్మ ధర్మజు లోఁపినకొలంది ననునయించిరి కాని సలసలఁ గ్రాఁగుచున్న చమురునఁ జన్నీరు చిలుకరించిన యను

వున నాతనియెడ నవి మఱింత క్రోధకారణములయ్యె. అట్లు మించి నిందించుచున్న శిశుపాలుని బంధుభావంబుఁ బాటిం పక శౌరి చక్రంబున వానిశిరంబు ధరంబడఁగొట్టె. అంతఁ బ్రశాంతవిఘ్నంబై శుభావహంబై మహాధ్వరంబు సమాప్త ప్రయోగంబయ్యె. ద్రౌపదీధర్మజు లవభృథస్నానంబునఁ బరి పూతదేహులై విమలులై విలసిల్లిరి. క్రతువు చూడవచ్చిన రాజులు ధర్మజుచే సత్కృతులై వీడుకొని తమ తమ రాజ ధానుల కేగిరి. గోవిందుండును బయనంబున కుద్యుక్తుండైనఁ గని పాండవులు దుఃఖితులై యెట్టకేల కొడంబడి చాల దూరము పాదచారులై నాగనంపి లోచన గోచర మగునంతకు దృష్టులు నిలిపి తమ హృదయముల నట నిలిపి యెట్టకేని మగిడిరి.

## —:దుర్యోధన పరాభవము:—

దుర్యోధనుండు తత్సభా విభవంబుఁ జూచు వేడ్క మది గదుర గాంధారునితో నటఁ గొన్ని దినంబు లుండి యొకనాఁడు దాని రమణీయతకు విస్మితచకితుండై యయ్యె ప్రదేశంబులఁ గ్రుమ్మరుచు నొకచో వివృతద్వార ప్రదేశంబు సంవృతంబుగా సంశయించి చొరనొల్లక సంవృతంబు వివృ తంబుగా వగచి చొరంబోయి తత్కవాట స్ఫటికశిలాఘటిత లలాటుం డయ్యె. తటాలునఁ దన్నెవరేని గనుఁగొనిరకా శంకించి వెనుదిరిగి చూచి యెవ్వరు లేరని యెంచి మఱొండు

ప్రదేశంబునకుఁ బోయి సమప్రదేశం బున్నతప్రదేశంబుగా విశంకించి యెక్క సమకట్టి కాళ్లు తడబడ నిమ్నప్రదేశంబు సమతలంబుగా భావించి క్రమగతిం జని భూపతితుండయ్యె. అటనుండి తటుకున లేచి చుట్టుప్రక్కలఁ జూచి మామా! యేమి మన బ్రతుకి ట్లయ్యెనని కుందుచు వేఱొకవంక కేగి నీలాశ్మస్థగిత విమలమణిస్థలంబు జలాశయంబుగా సంశయించి పరిధానం బెగఁద్రోచికొనిపోయి భ్రాంతింబొందితిఁ గదా యని తన్నుఁ దా నిందించికొని స్ఫటికదీప్తి జాల పరివృత జలాశయంబు స్థలంబుగా నిశ్చయించి కట్టిన పుట్టంబు తడియం జొచ్చిపడి లేచె. అది యంతయుఁ గనుచుండిన పాంచాలి చెలులతో మా మామ పుట్టంధుఁడుఁ. మఱియు మధ్య నంధుఁడయ్యెఁగదా యని పరిహాససూచకంబుగా నగియె. భీమాదులును వికావిక నవ్విరి. దాని నెఱిఁగి ధర్మపుత్త్రుండు వాయుసూనుచే ధృతరాష్ట్రసూతికి దివ్యవస్త్రంబు లిచ్చి పుచ్చె.

ఇట్లు సభాప్రలంభంబునకు లజ్జితుండై సుయోధనుండు పాండవుల వీడ్కొని కరిపురి కరిగి ధర్మజు రాజసూయంబు దన కసూయాజనకంబగుటకు సకలజన నయనోత్సవంబైన తత్సభాలక్ష్మి తనకనులకగ్నిజ్వాలయై మహాదాహంబు సేయుటకు సంతప్తహృదయుండై నిదాఘదాహంబున నింకి తఱుఁగు నల్పజలాశయంబునుంబోలెఁ దఱిఁగి కందుగల

పసిండిం గాచినఁ గందివివర్ణమయిన వయినమున నంతస్తాప హవ్యవహాదాహమున వివర్ణుండై వంది స్వరాజ్య వ్యాపార చింతల వర్జించి పాండవరాజ్య నాశవ్యాపారచింతం దవిలి సుహృద్విరంజనుండై పాండవ నాశ కార్య రంజనుండై యెవ్వరితోడం బలుకక యున్న నతని విన్నదనంబు గని శకుని సమీపించి "సుయోధనా! ఏల యిట్లు మౌనివై సర్వకార్య విరంజనుండవై తివి? నీ ముఖంబు దీర్ఘ నిశ్వాస ధూర్తుని హతింజేసి కలుషమైయున్న దేల? ఏ నుండఁగ నీకు దురపిల్ల నేల? ధారణీ రాజు లెల్ల భవత్ప్రతాప నిరాకృతులుగాఁ దలంపుము. నీ సంతాపకారణంబు దెల్పు" మనిన నతం డిట్లనియె.

—:దుర్యోధను దురాలోచనము:—

ఎందే నే యుగంబుల నేని వినంబడని యపూర్వము సర్వమనోజ్ఞ తాపూర్ణ మిష్టభోగావహమునైన యా సభ ధర్మజుఁ డేరీతిం బడసెనోకదా? దానికి భయమంది ధరధీశులెల్ల వైశ్యులపోలె వశ్యులై ధనావళులు తడయక తెచ్చి యిచ్చి పూజించిరి. పరాక్రమార్జితములైన సపత్నుల పేర్మిని నాత్మహానిని మానధనుండైన మానవేశ్వరుండు చూచి సైఁచునే? అనిన సుయోధనుం జూచి మాయావి యగు శకుని "దుర్యోధనా! దీని కింత చింతింపనేల? నీ తండ్రి యుత్తరవొందు పడయుట తడవుగా సపత్నుల సర్వ

స్వమ్ము క్షణములో నీయదిగాఁ జేయఁగలను. పోదముపద యని యతని నతని తండ్రి యొద్దకుఁ దోడ్కొనిపోయి యాతని శరీరకార్శ్య వైవర్ణ్యంబులు చెప్పిన విని ధృత రాష్ట్రుఁ డదిరిపడి కొడుకు నొడలు దడవి కడు నడలుపడి యిట్లనె.

"కుమారా! కౌరవైశ్వర్యంబెల్ల నీ యందె సమ ర్పితమయ్యె. ఎల్లరు నీకుఁ బ్రీతులకాని యప్రియులు లేరు. సకలభూపతులు నీ పనుపుసేయ వివిధ భోగంబులు దివి జేశున ట్లనుభవింపఁదగు. నీ విట్లు భోగపరాఙ్ముఖత్వమ్ము నొంది కృశించి తనుచ్ఛాయఁ దఱఁగియుండ నేల?"

తండ్రి ప్రశ్నల నూఁతగాఁ గొని తన మనోభీష్టంబు నెఱిఁగింప నదనని తలంచి సుయోధనుం డిట్లనియె. "జనకా! పాండవుల విభవం బాఖండలు వైభవముకంటె నధికంబై తదీయ ప్రతాపరుచులతో దిక్కులు నిండె. సఖ్యసంబం ధములచేఁ జక్రియు యజ్ఞసేనుండును దక్క నరివెట్టనివా రవనిలేరు. వసుమతీచక్రమెల్ల వారి వశమయ్యె. రారాజనై ప్రాభవశూన్యునట్లు దీని నెట్లు చూడనోపుదుఁ? మఱియు వినుము. రత్నపరిగ్రహణంబునందు ధర్మజుండు నన్ను నియోగించె. వారి గృహంబు రత్నాకరంబన నొప్పు. గాడకాంభోజపతులు వివిధ వర్ణ రత్నకంబళంబులును శుక వర్ణ వాహ నివహములును, సింహళ చోళ కేరళ పాండ్య

రాజపుత్త్రులు మౌక్తిక విద్రుమ పుంజంబులును నేలాగురు చందనంబులును నిచ్చిరి. కేకయ కాశ్మీర కాంభోజాది మహీపతులును, కురుకచ్ఛనివాసులును, సింధు పారసీక హూణదేశాశ్వంబులను బర్వతనిభంబులైన యిభంబుల సమర్పించిరి. వనవాసులైన పులింద బర్బర పారద తురుష్క ప్రభులు హేమశైల రామగిరి కురుక్షేత్రజంబులైన కౌసుంభక్షౌద్ర దివ్యౌషధంబులను, నింద్ర నీలేంద్ర గోప ప్రిక్ర చంద్ర మయూర కీరవర్ణ తురంగమంబులను సౌవర్ణ కీట పట్టజాండజ శయ్యలను మణి కాంచన రచిత గజ దంత మయ శిబికాసనంబులను నర్పించిరి. చిత్రరథుండు గంధర్వహాయంబు లేనూటి నొసంగె. తుంబురుం డను గంధర్వుండు నూఱు వారువము లిచ్చె. విరటుండు రెండు వేల గజంబు లిచ్చె. ద్రుపదుండు వేయి గజంబులఁ బది వేలు హయంబులఁ బదునాలుగువేలు విలాసినీ జనంబులఁ బదివేలు దాసీజనంబుల నిచ్చె. కృష్ణుండు కటస్యంది సుగంధి దాన జల సంపదల నొప్పువాని సూర్యరశ్మి ఢిండుకఱుపఁజాలు రుచిమన్మణిహారాలంకృతంబులైనవానిఁ బదునాలుగువేల దంతావళంబుల సంప్రీతి మెయి నొసంగె.

ఉ. భావి పురాతనాద్యతన
        పార్థివలక్ష్ములు పాండవేయు ల
    క్ష్మీ విభవంబుతోడ నుప
        మింప సమంబులుగావ శేష రా

జావళిలోన నత్యధికు
    లైన సపత్నుల పేర్మిఁ జూచి యేఁ
జూవె సహింపనోపక కృ
    శుండ వివర్ణుఁడనైతి నెంతయున్.

లక్ష భూసురులు గుడిచినఁ దనంత నొకపరి మ్రోఁగు విచిత్ర శంఖ మధ్వరంబు ముగియుఁదనుక విడువక మ్రోసె. అమ్మఖంబున సభముందును గడుఁ బ్రియంబున నభ్యర్చింతుఁడ కాని వంచితుఁడు లేఁడు. హరిశ్చంద్రు రాజసూయంబు కూడ నీ సవనంబుతో సాటికాదని యభ్యాగతులైన నారదాది మునీంద్రు లనిరి. బ్రహ్మ విదుల నెనుబది యెనిమిది వేవుర నల్లిండ్ల నిలిపి ముప్పండ్రు దాసులఁ బ్రత్యేకంబుగ నొసంగి యుధిష్ఠిరుండు రక్షించుచున్నాఁడు. అనుదినము కలధౌతమయ పాత్రంబులఁ బదివేవురు భూసురు లతనిచే సేవితులై కుడువఁ గట్టఁ దొడువఁ బూయఁ గలుగుదురు. కష్టపురుషునికరణిని వారి పురుషార్థము నెట్లు చూచి సహింతును? అవభృథస్నానులై ద్రౌపదీ ధర్మజులకు సాత్యకి మౌక్తికచ్ఛత్రంబుఁ బట్టె. భీమ పార్థులు మణిహేమదండ చామరంబులు వీచిరి. కవలును గృష్ణుఁడును ధృష్టద్యుమ్నుండును రాజుల వేర్వేఱ మ్రొక్కించిరి. అట్టి తరుణంబున దీప్తిదఱిఁగియున్న మమ్ముఁ గని పాంచాలీ పాండవ వాసుదేవులు నగిరి. ఆ సభం జరిగిన ప్రలంభంబు నాకింకను హ

దయ శల్యంబయి వేధించుచున్నది" అని దుఃఖింప శకుని "రాజేంద్రా! నీకు వగవనేల? వారి రాజ్యలక్ష్మి యెల్ల మాయాదురోదరమున నపహరించి యిత్తు. ధర్మజుండు ద్యూతప్రియుండు. కాని యందలి యుక్కివం బెఱుంగఁడు. నే నక్షవిద్యయం దతిదక్షుండ. అతని నశ్రమంబున నోడింతు" నని యోదార్చె. శకుని పలుకులకు సుయోధనుండు సంతసిల్లి తండ్రి పదంబులపైఁబడి యితని మతంబున కొడంబడవలయు. విదురాదులతో నాలోచించిన వా రిందుల కియ్యకొనరు. నీవ యాజ్ఞ యీవలయు. ఈయనంటివేని యీ క్షణమ సర్వభక్ష భక్షితుండనయ్యెద ననినం గుమారున కాహ్లాదకరంబుగఁ గానిమ్ము చూతమని వేవురు శిల్పాచార్యుల రావించి రమ్యంబగు సభ యొండు నిర్మింపంబంచి యేకాంతంబున విదురునకు శకుని మతంబు వినిపించిన నతఁడు విస్మితుండై యిట్లనియె.

"కలి ద్వాపర సమీపం బగుటయు జూదం బఖిల ప్రజాక్షయకరం బగుటయు నెఱుంగవైతివేల? నీ పుత్త్రులొండొరులతోఁ గలసి వర్తించుట నీ కొప్పదయ్యెనే? వారి దుర్వ్యవసాయం బెల్ల నుడిపి యిక్కురువంశ రక్షణంబు సేయుము"

అనిన ధృతరాష్ట్రుండు కొంతవడి యోజించి, "నేను నీవు శాంతనవ కృప ద్రోణాదు లుండఁ బుత్త్రుల కేల

భేదంబు పుట్టు? దీనికి నీ వొడంబడుము. వడిగల హయం బులఁ బూన్చిన రథ మెక్కి యింద్రప్రస్థమున కరిగి ధర్మ జాదులఁ దోడ్కొనిరమ్ము” ని పంచిన నతండు భీష్మున కంత యు నెఱింగించి యిది కర్జంబు గాదని విచారించుచుండె.

మఱియొక నాఁడు తండ్రి కొడుకుతో మంతనంబున మంతునకుఁ గాని యీ ద్యూతవిచారం బుడుగుమని పలు విధముల నొక్కి వక్కాణించె. అంతకన్న మిన్నగఁ గ్రతువు సేయుమనియె. వానిం బెరచెవిం బెట్టి సుయోధ నుండు తండ్రి కిట్లనియె.

“ద్యూతంబునకంటె వేఱొండు వర మీయఁదగినది లేదు. సులభోపాయంబున నరుల సంపద కైకొనందగు నేని యంతకంటెఁ జేయఁదగిన దేది కలదు? అల్పుఁడని శత్రు నుపేక్షించితిమేని మ్రాని మొదలి వల్మీకంబునట్ల క్రమంబునఁ బెఱుఁగఁగలుగు. అహిత వృద్ధి యుపేక్షిత మైనచో నల్పవ్యాధియుం బోలె నిర్మూలితాత్ముఁ జేయ కుండునే? నాక్షేమంబు గోరుదేని దీని కొడఁబడుము. విదురు మతము పాండవహితార్థంబ యని మరల మరల స్మృతికిఁ దేవలయునే? తన కార్య మొరుమతంబునఁ గావింపఁజనునే?”

సమయానుకూలంబుగ శకుని యిట్లనియె.

“తనయుని యభివృద్ధికి వేల యొడంబడవు? వడ్డ నంబులు లేక చతురంగ సన్నాహ మొనర్పక యుభయ

ఖరకర వివిధాయుధాన్యోన్య సంఘట్టనా రావంబు లెసంగ సంగ్రామంబు సేయక పరుల రాజ్యలక్ష్మిఁ బ్రాప్తించుట కేల యొల్లక మోసకా లొడ్డుమన్నావు? ఏ నక్రమ్మున రక్షములు దాల్చి ప్రతిపక్షతతుల యక్షీణ సంపదల జయించి యిత్తు. ధర్మజు రావింపుము వేఱొండుపాట వేల్పులకైనఁ బాండవోన్నతి హరింపఁగాదు”

ఎట్టకేలకు వారి మతంబునకు ధృతరాష్ట్రుఁ డను మతించి విదురుం బిలిచి “నీ వేగి యీ చిత్రసభం జూడ ధర్మజు ననుజులతోఁ బిలుచుకొనిరమ్ము. ఈ సభను సతంత్రము దుర్యోధనుఁ డను సుహృద్భావంబునఁ బ్రవర్తింపఁ గలవా” రనినఁ బెక్కుమారులు వారించి తుదకు నిర్బంధమున ధృతరాష్ట్ర నియోగమున గొడఁబడి యింద్రప్రస్థమున కేగి పాండవులచే నభ్యర్చితుండై నిజాగమన ప్రయోజనం బెఱింగించె.

ధర్మరాజు జూదము తగవుకాదని యోజించియుఁ బెద్దల యాజ్ఞ యనుల్లంఘ్యమని తమ్ములతో ద్రౌపదితో ధౌమ్యవిద్వజ్జనానుచరసంఘంబుతోఁ గదలి కరిపురికివచ్చి చేరె.

దుర్యోధనాదు లెదురేగి వారిం దోడితెచ్చి పలు మర్యాద లొనరించిరి. మఱునాఁ డందఱును వినోదభవనంబునకుఁ జని దాని రామణీయతం గాంచి మెచ్చిరి. ఆ యపూర్వసభామణి కుట్టిమంబున సుఖాసీనులయి యిష్ట

సంభాషణ క్రీడావినోదంబులం గొంత ప్రొద్దువుచ్చిన పిదప దుర్యోధనుం డజాతశత్రున కిట్లనియె.

"అన్నా! యిందుం గొంతతడవు సుహృద్ద్యూతంబున వర్తింతమా? నీవు ద్యూతప్రియుండవనియు నందుం గడుం గడు దక్షుండ వనియు విందు నిన్నుం బ్రీతుంజేయుటయ మాకుం గర్తవ్యంబు"

అనిన ధర్మజుండు దుర్యోధనుం గాంచి "క్షత్ర నీతికి నిష్కృతియుం జూదంబును గ్రమంబులుగావు. జూదంబు పాపవృత్తంబు. కుత్సితకితవులతోడ నాడిన నెట్టివారు సద్ధర్మ వివర్జితు లగుదురు. మాయాద్యూతంబున జయించుట మహాపాతకంబు" అన నా మాటలకు శకుని, "ఇలేశా! బలహీనులు బలవంతుల జయింపం గడగునెడ మాయాబలంబులం జేసి యొడుచుట యొందును గల యదియ. నీ కోటమి సిద్ధించునని భయంబేని యుడుగు" మన ధర్మజుండు రాజసపూరితుండై పిలువంబడి వెనుకంజ యిడుట యొడయనికిం బాడియే యని యాడం దొడంగి చందన కర్పూర కస్తూరీ పరిలిప్తంబయిన ద్యూతరంగంబు నందు ముందర గంధ పుష్పార్చితంబులైన యభిమతాక్షంబు లమర్చికొని మీలో నెవ్వరు నా తోడ నాడువారని గర్భోక్తులు వలికె. "నీతో నాడ నే నెంతవాండ. ఈ శకుని నాకై నీతో వాడంగడంగువాండు. అతని యోటమి నాయ

డిగ భావింతునని దుర్యోధనుండు తన చేతి రత్నకటకం బొడ్డె. అన్యులకై యన్యులాడు టెంతయు విషమం బ్బని మణిహారం బొడ్డి కౌంతేయాగ్రజుం డాడ నారంభించె. పెద్ద లెల్ల రా సభయందుఁ బ్రహృష్టహృదయులై యుచ్ఛ్వాసనస్థులై చూచుచుండిరి. క్రమక్రమంబున భూషణంబులు, సువర్ణ రత్న భాండాగారంబులు, చతుశ్శతనిధులును, వరూథయూథంబులును, మదాంధ గంధ సింధురంబులును, ధర్మజుఁడోడి బద్ధమత్సరుండై మరల యోషిత్సహస్రంబులఁ బరిచారికల, గంధర్వ హయంబులఁ దదితర సుందర తురంగ మృగసంఘంబుల నొడ్డి యోటువడియె.

అది గని విదురుండు రహస్యప్రకారంబున ధృతరాష్ట్రు చెవియొద్దఁ జేరి "నీ పెద్దకొడుకు పొడమిన యపుడ పెక్కు దుర్నిమిత్తంబులు పొడమె. వీఁడు ఖలుఁడు. ఎగ్గుల కోడన పుట్టినవాఁడు. ఎన్నండును బాపంబు పొరయని మా కులంబు నేఁడు నీ తనయుని కారణంబునఁ బాపభూయిష్ఠంబగుచున్నయది. ఒకని కారణంబునఁ గులంబున కెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబు. కులరక్షణార్థంబుగఁ గాదె కంసుని యాదవులు కృష్ణునిచేఁ జంపించిరి. నీ శాసనంబున వాసవసూనుండు కులపాంసను వ్యర్థీకృతాయోధను దుర్యోధను నిగ్రహించుఁగాక. ప్రజయు రాజ్యము తోంబడి తొమ్మండ్రుగురు నీ కొడుకులు

సుఖాంతముగాక. ఒక నక్క నోసంగి సింగముం గొనుట తగదే? నీకుఁ బాండవులు పెరవారలే? నీ సుతుఁడు బొగ్గులకై ఫలపుష్ప ద్రుమంబుఁ గాల్చుచున్నాఁడు. వారింపుము" అని యెన్నియనువులఁ జెప్పినను బుత్త్ర స్నేహంబున నెద్దియుం జేయక యూరక చూరకుండ దుర్యోధనుం గని యతఁ డిట్లనియె.

"అన్యాయమార్గంబున మాయావి యగు శకుని నూలు కొలిపి పాండవులఁ బరాజితులఁ జేయుట లగ్గుగాదు" అనిన దుర్యోధనుం డలిగి "నీవు పక్షపాతివి. వారినే వందివలెఁ గీర్తింతువు మమ్మునిందింతువు. మామే లెంచవు. నిన్నుంచుకొనియుంట యొడిని జెను ఫణి నుంచుకొనినట్లయ్యె. నీ యంత నీ వుండుము. మాకు బుద్ధిచెప్పరాకుము. పిలువనిపేరంట మేల మెడ వైచి కొనియెద" వని తూలనాడిన విదురుండు "దుర్బుద్ధీ! నీకుఁ జెడఁ గాలపువారే చెలులు. నీ యట్టివారే కార్యంబులు సెప్పువారలు. ప్రియములు పలుకువారిని మెచ్చునట్లు పథ్యంబున ప్రియంబునైన పలుకు నీ వంటివారు విందురే? రోగికిఁ బథ్యము రుచించునే?

తే. గీ. మొదలన ప్రియమయ్యును ꠰ తుదిగరంబు
పథ్యమగు పల్కు ప్రియులందు ꠰ బలిమినైనఁ
బలుకవలయు మోమోడక ꠰ యోసి యట్టి
వాఁడు దగు సహాయుండు భూ ꠰ వల్లభునకు.

నన్నన్యథా బుద్ధినొల్లక పలికితివి. పాండవులతోడి విగ్ర
హంబు నీకు లగ్గుగాదు" అని విగతవచనుండయ్యె.

అంతయు నోడితి విక నేది యొడ్డఁగలవాఁడ వని
కుని యన యుధిష్ఠిరుండు మోసమెఱుంగక రోషంబు పెనఁ
గొన దేవబ్రాహ్మణ వృత్తులు దక్క సర్వభూమియు నొడ్డి
యోడె. తదుపరి తమ్ముల నొక్కొక్కనిఁ బణంబిడి యోటు
పడి తన్నొడ్డికొనియు నోడె. అప్పుడు శకుని ధర్మతనయుం
గని "ఏల యింత బేలవై నిన్నొడ్డికొంటివి? ఐన నేమాయె.
ధనంబగు పాంచాలి నొడ్డుము. గెలువఁ గల" వన ధర్మ
రాజు శివముగొన్నవాని తెఱంగునఁ దన్నెఱుంగక ద్రౌపది
నొడ్డె. భీమార్జునులు వారించిరి. ప్రయోజనంబు లేక
పోయె. వెంటనే యోడె. ధర్మజు మొగంబున నపుడు దైన్య
గపడియె. అంత దుర్యోధనుండు గద్దియనుండి లేచి విదురు
కు మొగంబై "పాండవులు తమతో ద్రౌపదితో సర్వంబు
కోడి దాసులైరి. దాసి యగు పాంచాలిం బిలువుము
భా భవనం బలికింపవలయు" నని దర్పోద్ధతుండై పలుక
తండు సహింపనోపక "దుర్యోధనా! నీ వెక్కడ? ద్రౌపది
యెక్కడ? దాస్యమెక్కడ? ఈ దుడుకు నీకుఁ దగదు. అవి
తిపరుం డొల్లింటి సంపదయు నపేక్షింపదు. పాంచాలి
కంటి కంత యనపాశ్రయయై తోఁచెనే? తులువలతోఁ జేరి
చెడనున్నాఁడవు. ఆ భీమసేను నెఱుంగుదే? ఆశీవిషంబుల

నేల యలిగించెదవు? నీ ద్యూతఫలంబు వేణుఫలంబునుం బోలె సహమూల వినాశంబునకు నిమిత్తంబగు" నని సుయోధనుండు విదురుం దూలనాడి ప్రాతిగామిం బిలిచి పాంచాలిం దోడి తేరఁ బంచె.

వాఁడు సర్వగతిం జని సభయందలి విశేషంబులు వివరించి రాజు నాజ్ఞగా నాయమం బిలిచె. కృష్ణ యులికిపడి "అకటా! ఏ యుగంబుననేని యెట్టి దుష్కృతవుండేని భార్య నొడ్డి యోడినవాని విందుమే? ధర్మపుత్త్రుండుకూడ నిట్లా చరించునే? కానిమ్ము. ప్రాతిగామీ! నన్నోడి తన్నోడెనా? తన్నోడి నన్నోడెనా? ఎఱిఁగినఁ బలుకుము. ఎఱుఁగవేని యా జూదరి నడిగివచ్చి నన్నుం దోడ్కొని పొ" మ్మని నుడివె.

ప్రాతిగామి క్రమ్మఱవచ్చి పాంచాలి పలుకులు ధర్మనందనునకుం జెప్పిన నతండు దురోదర పరాజయ దుఃఖిత చేతస్కుండై యదత్త ప్రతివచనుండయ్యె. దుర్యోధనుండు ప్రాతిగామిం గని "యీ సందిగ్ధాంశము నిచ్చటికే వచ్చి సభ్యుల నడిగి తెలిసికొందువు రమ్మని పిలుచుకొనిరమ్ము. పొ" మ్మన నతం డేగి యవ్వార్త యెఱింగించె. అద్దేవి మది వెఱఁగంది వాని పిఱుందన యేకవస్త్రయు నధోముఖియునై సభకుఁ జనుదెంచి కురువృద్ధుల మఱువున నిలిచె. చూడ నోపక లజ్జితులై దుఃఖాకులిత మనస్కులై తలలువాంచి యున్న పాండవుల వైలక్ష్యం బుపలక్షించి సంతసించి సుయో

ధనుండు దుశ్శాసనుం జూచి "ప్రాతిగామి భీమునకు వెఱచు నీ వేగి దాని నీడ్చికొని ర" మ్మన నతండు పరుగునఁ బాం చాలికడకుఁ బోయె. వచ్చువాని పరువుంగని బెబ్బులింగన్న యిఱ్ఱిచందంబున భయభ్రాంతయై వడవడ వడంకుచు నయ్యబల "అన్నా! నన్ను ముట్టకుము. ఏకవస్త్రను. రజస్వలను. సభ కెట్లు రానేర్తు?" ననిన విని యద్దురాత్ముఁ డద్దేసం బదరి "పంచభర్తృకా! ఏకవస్త్రవై తేమి? విగతవస్త్రవై తేమి? నిన్నెట్లును గొనిపోదు" నని రాజసూయావభృథస్నాన పరిపూతంబైన పెనుపొందు నామె వేణిం బట్టికొని నిమ్కురు ణుండై సదస్యులు సంభ్రమించి చూడ సభ కీడ్చి తెచ్చె.

వాతావధూతంబైన పతాకయుంబోలె దుశ్శాసనాప కృష్టయై ద్రౌపది వికీర్ణ కేశకలాపయు వివర్ణవదనయు నై సభ్యులం గని కోపలజ్జాపరవశయై యిట్లనియె. "కురువంశ భూషణుండగు ధర్మరాజు దైవోపహతుఁడయ్యు ధర్మ మేల దప్పు? ఈ దురాత్ముఁ డేల నన్ని సభ కీడ్చుకొనివచ్చె? భరత వీరుల కిట్టి కార్యంబు ధర్మంబ కాఁబోలు! జగత్త్రయ జయ భుజవీర్య సనాథులైన నాథులు గలిగియు ననాథనైతి!"

అని రోషకటాక్ష నిరీక్షణంబులు భర్తలపైఁ బ్రసరింపఁ జేసినఁ గటకటపడి కటము లదర వడముడి బొమముడి గదుర నుగ్రుండయ్యుఁ గ్రోధంబు నడంచికొని ధర్మరాజున కిట్లనియె. "అన్నా! సర్వము నోడితివి. మమ్మోడితివి. నమ్మతంబ

భార్యను బణంబుగ నిడి యోడునంత యవివేకమే? నీ నెప
మున నా గోల నీచుఁ చే నీ దుష్టసభను బరిభూత యయ్యె.
ఇంతకుఁ గారణంబై యధర్మవృత్తిం బ్రవర్తించిన భవద్బా
హుదాహంబు సేయక నాకోపదాహంబు శాంతింపదు" అని
రోషావేశ పరవశుండై పలుక నులికి సవ్యసాచి యిట్లనియె.

ధర్మసుతుండు ధర్మంబు దప్పిన ధరణి తల్లడిల్లదే?
అతని దిద్దునంతవారమే మనము? పిలువఁబడి మరలుట
క్షాత్రనీతిగాదు. ఆడినది జూదము. అందుఁ బాడియేది?
పాడికానిదియేది? ధీరులు గురుల నతిక్రమింపఁ దగవే?
చాలు. నీ యుద్యోగం బుడుగుము. అని శాంతింపంజేసె.

అంతకు నన్యాయ శ్రవణ వికర్ణులై యున్న సభా
సదులఁ గని వికర్ణుండు లేచి "పెద్దలారా! ధర్మజ్ఞులైన
వృద్ధులతోఁ గూడినది సభ. అందఱు భార్యలుగలవారు
కారే? ఈ సుశీల నిన్నిచు లిట్లు నిందితఁజేయ నూరక
చూచుచుండఁ బాడియే? ఈ యమ ప్రశ్నంబు విచార
ణీయంబు. తెలిసియుఁ బెద్ద లేలోకో యూరకున్నవారు?
ద్రౌపది వారి కెట్టుదాసి? ఏవ్వర ధనంబు నొకఁ డొడ్డఁ
జనునే? ఓడిన ధర్మజుండు మరలఁ బాంచాలినొడ్డ బాధ్యుఁ
డెట్లగు? దుర్వ్యసనంబులం దవిలినవాఁడు ధర్మువు దప్పి
వర్తిల్లు. అట్టివాని కృత్యంబులు చేకొనందగవు. కావున
ద్రౌపది యధర్మవిజిత. ఆమె నిటకుఁ దెచ్చుట యన్యా
య్యంబ" అనినఁ గర్ణుఁ డిట్లనియె.

వృద్ధులున్నచోటఁ దగుదునని లేచి గరువంపుఁ బలుకు లాడఁ జెల్లుతవాని కేల? ధర్మజుండు సర్వస్వమ్మో నోటువడినప్పు డిది యతనికి వెలిగాదు. ఇది యనేక భర్తృక గావున బాధకి. దీనిని విగతవస్త్రం జేసి తెచ్చినను ధర్మ విరోధంబు గాదు. అని ప్రత్యాఖ్యానంబు సేయ వికర్ణుండు "పతివ్రతను దూలనాడి యవమానించిన పాపఫలం బూరక పోవునది కాదు. మీ వంటి మంత్రులు గలిగియున్నప్పు డిది శీఘ్రకాలంబునఁ వంశదాహంబు సేయు సందియంబు గలదే! కులటనైనను దాని మానభంగంబు సేయు మాన వంతు లొప్పుదురే?" యన దుర్యోధనుండు వానిం బదరి దుశ్శాసనుం బిలిచి ద్రౌపదియుఁ బాండవులయు వస్త్రంబు లొలిచి తెమ్మనఁ బృథాతనయులు తమ పై వస్త్రంబులు దీసి ముం దుంచిరి.

—:ఆపన్నరక్షణము:—

తగనిపనియని యైనఁ దలఁపక దుశ్శాసనుండు ద్రౌపది కట్టిన పుట్టంబు నొలిచె. ఆ యమ వేఁడొండు గతి లేదని హస్తాబ్జంబులు పై కెత్తి.

మ. కరుణాదూరత నూరకుండి రయయో
గాంగేయ ముఖ్యుల్ మహా
పరిభావంబున కోర్వరామిఁ దలలుఁ
వక్షమ్ములోఁ గ్రుక్కి దు

ర్భర దీనస్థితి నున్న వారలు పతుల్
రావే నను౦ బ్రోవవే
శరణం బెవ్వరు లేరు నాకు నిఁకఁ గృ
ష్ణా! దీన సంరక్షణా!

అని ప్రార్థించె. దీనావనుఁ డగు శ్రీకృష్ణుం డామె కక్షయంబుగఁ బటంబులఁ బ్రసాదించె. దుశ్శాసనుం డొలుచుకొలఁదిఁ దఱుఁగక వలువ లెప్పటివలె నగుచుండె. వస్త్రంబులు ప్రోవులయ్యె. వాని యొడలు ముచ్చెమటలు గ్రమ్మె. అలసె. వాఁడు సేయుచున్న క్రూరకార్యంబునకు సహింపఁజాలక కోపరక్తాంతనయనుం డగుచు భీమసేనుం డంతకాకారుండై దంతసందష్ట దారుణ ముఖుండై

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనే
కుల్ చూచుచుండఁగ్ మహాో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు చేసిన ఖలుఁగ్
దుశ్శాసనుఁగ్ లోక భీ
కరలీలఁగ్ వధియించి తద్విపుల వ
క్షశ్శైలరక్తోరు ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నా
స్వాదింతు నుగ్రాకృతిఁగ్.

ఇట్లు చేయునైతినేని పితృ పితామహుల గతికిఁ దప్పిన వాఁడ నగుదు నని వానిపై కుటికె. విదురుం డడ్డుపడి నాయనా! వీరి కిట్లును వినాశకాలము దాపరించినది. మమ్ముఁ గనియైన ధర్మతనయు మాట నిలుపుమని వారించె. సభలోని సందడి చప్పఁ జల్లాఱె.

సభికులార! నే నిజముగ వీరి దాసినే? ఎఱుఁగఁ జెప్పుఁడని ద్రౌపది మరలఁ బ్రశ్నించె. భీష్ముఁ డప్పాంచాలిం గననేరక తలవాంచి "పతివ్రతా తిలకమా! నీ యోగ్యతయే నిన్నుఁ గాపాడుచుండె. జీవచ్ఛవంబులమై పడియున్న మమ్మేల ప్రశ్నించెదు? ఇందలి ధర్మసూక్ష్మంబు ధర్మతనయుఁ డెఱిఁగి చెప్పవలయుఁ గాక యలంతులు వలంతురే?" యని ధృతరాష్ట్రు పాపవ్యవసాయాంగీకారంబును గూర్చి యతని నిందించె.

కర్ణుండు లేచి "తరుణీ! ఒక్క భర్తను గలిగి యుంటేని నీ కింత వంత ప్రాప్తించియుండదు. ఇప్పుడేని జూదంబున నాలి నోటు వడనివానిగా నీ సభయం దొకని నేరికొనుము. సుఖపడఁగలవు" అని యుల్లసమాడె. వాని మాటల కనుగుణమ్ముగ దుర్యోధనుండు తన తొడ చూపి ద్రౌపదిని రమ్మని సన్న చేసె. అది గని మారుతి మండిపడి యాయుధంబు లున్న వలనికి దృష్టులు పరఁగించుచు

ఉ. ధారుణి రాజ్యసంపద మ
దంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున
నుండఁగఁ బిల్చిన యుద్ధురాత్ము దు
ర్వార మదీయ బాహుపరి
వర్తిత చండ గదాభిఘాత భ
గ్నోరుత రోరుఁ జేయుదు సు
యోధను నుగ్ర రణాంతరంబునన్.

అనుచు నడవ నతని సంరంభ విజృంభణంబులు చూచి భీష్మ ద్రోణ విదురు లక్కడంబై యిది కోపంబునకు సమయంబుగాదు. శాంతింపుమని ప్రశాంతచిత్తుం జేసిరి. వీని తల దన్నువఱకు నీ నా కరంబుల జలపానంబు సేయనని భయంకర ప్రతిజ్ఞ గావించి భీముండు మరలె. అప్పుడా సభయందు దుశ్శకునంబులు పెక్కులు పుట్టె.

దుర్నిమిత్తములకు నంతకు మించిన భీముని భీమ ప్రతిజ్ఞలకు భీతుండై మేను వడఁక మించివచ్చె నని వగచి ధృతరాష్ట్రుండు కొడుకును బెక్కువిధముల దూఱి ద్రౌపదిని జేరంబిలిచి "అమ్మాయీ! నా కోడండ్రలో నీవు కడు నభ్యర్చితవు. నా యెడఁ బ్రసన్నమతివై యీ నా కొడుకుల దుడుకుల నెడఁద గణింపక మన్నించి నీ యిష్టంబు గోరుము. నీకుఁ బ్రియంబుసేయ సంసిద్ధుఁడ" ననిన ద్రౌ

వది యతనిం గని "పెద్దలకు వరంబీయఁ గోర్కి గలదేని ధర్మతనయుండు దాస్యవిముక్తుఁ డగునట్లు ప్రసాదింపుఁ" డని నేర్పుమెయిఁ గోరె. సంతసించి యంధరాజు రెండవది కోరుమన నద్దేవి "ధర్మజు తమ్ములు తమ శస్త్రాస్త్రములతో విముక్తులఁ జేయుఁ" డని కోరె. అదియు నిచ్చితి మఱియుఁ గోరుమన ద్రౌపది "క్షత్త్రియకాంత కింతకంటె నడుగ నధికారము లే" దనియె. ఆమె ధర్మసూక్ష్మజ్ఞతకు గుణంబులకు సంతసించి ధృతరాష్ట్రుండు ధర్మజుం బిలిచి మెప్పటియట్ల మీ రాజ్యంబు సర్వసంపదలు నిచ్చితి. వీరి మొగ్గుల మఱవుమనిన ధర్మజుండు తండ్రి యానతిఁ దలఁ దాల్తు ననియె. భీముఁడు "లేచి కొఱవితోఁ గాల్చి జలముం జిలికినవిధమునఁ బలికిన పలుకులలోని పోటులఁ జాటింపక తలయూఁపదగునే? తమ్ములు ప్రాణంబులతోనుండ ధర్మరాజును భార్యా కృపాలబ్ధసిర నేలింతురే? స్త్రీ ధనము గొని జీవించునంత యధమాధముఁ డగునే యమనందనుఁడు? పరాక్రమోపార్జితంబ క్షత్త్రియుల కానుభావ్యములు" అని యొల్లకున్న "భార్య కృపయేల! ఆర్యకృప యనుకొనరాదా?" యని సాంత్వన వచనంబుల నలని సమాధానపఱచి ధర్మజుండు తమ్ములతో ద్రౌపదితో నింద్రప్రస్థమ్మునకుఁ బయనించె.

—:పునర్ద్యూతము:—

దుర్యోధనుండు కర్ణ శకుని సైంధవ దుశ్శాసనులతో

నాలోచించి తండ్రికడకేగి "మన మెంత మేలుచేసియుఁ బాండవులకు హితులము కాఁజాలము. వారి నొక వంక నీ పరిభవాగ్ని కాల్పకుండునే? ఆశీవిషముల నలఁగఁబొడిచి కంఠ సమీపంబున విడిచినట్లు వారల విడిచిపుచ్చితివి. ఎక్కటికాండ్రు వా రొక్కటై పగ సాధింపకుందురే? వారి నీ సారి ద్యూతంబునకుఁ బిలిపింపు" మనిన నతం డులికిపడి "కుమారా! వదలిపోయిన సింగంబులయెడకు మరల నడచు జడునికైవడి వారి సముఖంబు నేల యాసించెదు?

ఉ. అన్నకునోడి భీముఁడును
నర్జునుఁడుఁ గవలుఁ సతీమణిః
బన్నము సేయునప్డు మిముఁ
బందల నొప్పరికించిరింక వాం
డ్రన్నను గిన్ననుం దలఁప
కాగ్రహావృత్తి మెయిం జరించి నీ
యున్నతి రూపుమాపుదు ర
హో యిపు డేటికి జూద మాత్మజా!"

నీ దుర్వ్యవసాయం బింకనైన నుడుగుమని ప్రార్థేయ పడియె. సుయోధనుండు చిర్నగవుతోఁ "దండ్రీ! పిదప మొదటిపని సేయు మేమంత వెఱ్ఱులమే? ఇప్పటి కట్టుదిట్టములు వేఱు. తప్పక రప్పింపవలయు" నన నతం డొడంబడి ప్రాతిగామిం బంపె.

పితృనియోగంబును విధినియోగంబును నవిలంఘ నీయములని పాండవులు వెంటనే కదలి వచ్చిరి. మరల

ప్పటియట్ల ద్యూతరంగంబునఁ గూర్చుండిరి. శకుని ధర్మజుం గని "ధృతరాష్ట్రుండు మిము గౌరవించి యిచ్చినవానిని మీరు ణంబుగఁనుంపఁదగదు. మన యిప్పటిపణంబు వేఱు. ఇందోటు న వార లజినవల్కలములఁ గట్టి వన్యమూల ఫలాశనులై హ్మచర్యంబునఁ బండ్రెండేండ్లు వనవాసంబు చేసి పద పడి జనపదంబున నొరు లెఱుంగకుండ నొకయేఁ డజ్ఞాతవాసం ను జలిపివచ్చి క్రమ్మఱ వారి రాజ్యముఁ గైకొనవలయు. అజ్ఞాతంబున నెఱుంగఁబడినవారు మరల బండ్రెండేం డ్లర ణ్యవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబును సలుపవలయు. ట్లొప్పుదురేని జూదమాడఁ గడఁగవచ్చు" ననినఁ బునర్ద్యూ తార్థము పిలువఁబడి మగుడనగునే యని

ధర్మసుతుఁ డాడి శకుని క
ధర్మస్థితి నోటువడియె ♦ దైవముచెయిదిన్
నిర్మితమైన శుభాశుభ
కర్మఫలం బెట్లు దేహి ♦ గడవఁగవచ్చున్?

పునర్ద్యూతపరాజితులైన పాండవులు కురువృద్ధుల గురుల వీడుకోళ్లు గొనిరి. విదురుండు "వృద్ధయగు కుంతి నవాస పరిక్లేశంబునకోర్వదు. మద్గృహమున నుండుఁగాక. దితరు లన్యోన్యహితులు. మీరు కృష్ణద్వైపాయనశిక్షిత లరు. కృష్ణరక్షితులరు. మీకు ధౌమ్యుండు పురోహితుండు. దైవమానుష సంపన్నులరు. ధర్మచరితంబున ఋషులను మహత్త్వమునఁ గుబేర వాసవాదులను జయించినవారలు.

భూమియు గాడుపును జంద్రాదిత్యు లెల్లప్పుడు రక్షింతురు గాత! ఎల్లకార్యంబుల యందు నప్రమత్తులరై వర్తింపుఁడు. అరుగుఁడు. పునర్దర్శన మయ్యెడు" మని కలిపిన నతని వీడ్కొని తల్లి చరణంబుల కెఱఁగిరి. మిగుల దుఃఖమానస యై కుంతి "ఆపద్బంధూ! కృష్ణా! నా కుమారు లిట్టు లనాథులై వనవుల మునివృత్తి నుండవలసినవారికా! ధార్త రాష్ట్రుల వంచనఁ గాక వీరు రాజ్యనిరాసయోగ్యులే?" యని యెలుఁగెత్తి విలపించి సహదేవుం గౌఁగిలించి,

క. అన్న! సహదేవ! నీవును
నన్నలతో నరిగెదన్న! యక్కడవులకును నీ
వున్నను సుతులందఱు నిం
దున్నట్టుల నాకుఁ జిత్తకు మూఱడియుండుఁ౯.

అని శోకాక్రాంతయై వినయ వినమితోత్తమాంగ యైన పాంచాలింగని బాష్పజలంబు లురల "బిడ్డా! నీ కతమున ద్రుపదకులము పాండుకులము వెలిగె. పురుషసింహులగు నీ పతుల తోడన నడవుల కేగి వారి కుపచరింపఁబూనుటచే నీవ కడుఁ బుణ్యాత్మురాలవు" అని కౌఁగిలించి దీవించె.

—:వనవాసగమనము:—

ముక్తకేశియై మందగతిని బతుల పిఱుందన ద్రుపద పుత్త్రి యేగుచుండం జూచి యంతఃపురకాంతలెల్లఁ దలలు వంచి దురపిల్లిరి. భీముఁడు దుర్యోధన దుశ్శాసనుల, నర్జు నుండు కర్ణుని, సహదేవుండు శకునిని దురంబున హతంబొన రించునట్లు ప్రతిజ్ఞలు పలికి వెడలిరి. పౌరులు కౌరవుల నిం

సాగిరి. అది విని ధృతరాష్ట్రుండు కొడుకుల దుర్న
బున నిఁక నేమిపుట్టునో యని వగచి విదురుం బిలిచి
డవు లెట్లుపోయిరి? వారి మొగంబు లెట్లుండె? విన
తు చెప్పుమని యడిగిన నతని కతఁ డిట్లనియె.

ధర్మజుండు వస్త్రాంతమున వదనంబు గప్పికొని యేగె.
సేనుండు బాహులు చాఁచికొని యరిగె. ఇసుము చల్లుచు
ద్రపుత్త్రుండు చనియె. భూరేణు లిప్తశరీరుఁడై నకు
డు పోయె. అధోవక్త్రుఁడై సహదేవుండు నడచె. వివృత
యై పాంచాలి బయలుదేఱె. రౌద్రయామ్య సామగాన
ఖరితాస్యుఁడై ధౌమ్యుఁడు మునుగ వెడలె.

అనిన నట్లేల వారు పోయిరని ధృతరాష్ట్రుండు
చ్ఛింప విదురుం డిట్లనియె. నిజరూపాలోకన జనదాహ
యంబున ధర్మజుం డట్లేగె. బాహుదర్పము నేర్పునఁ జూప
బ్బెనని వాయుపుత్త్రుం డట్టులు పోయె. ఇంతకంటెఁ దఱు
ంగ శరంబులేసి పగఱఁ జెఱతునని యిసుము సల్లుచు ఫల్గు
ం డరిగె. దుఃఖానుభావంబున కనుచితంబైన సుందరరూ
పంబు చూచి జనులు దుఃఖింపకుండ ధూళిధూసరిత శరీరుండై
కులుండు నడచె. దీనత నొందిన తన మొగంబు గన్నవారి
కెగ్గగునని సహదేవుఁ డధోముఖుండై చనియె.

చ. తడిసిన యేకవస్త్రపరి
ధానముతోడ విముక్తకేశియై

తోడరుచు దుఃఖభావమున
ద్రోవదివోయె మహాహావంబునన్
బడిన నిజేశ మిత్ర సుత
బంధుజనంబుల శోకవేదనం
గడుకొని యిట్టులేగుదురు
కౌరవభామిను లివ్విధంబునన్.

భారతరణనిహతు లగు కౌరవుల పరలోకక్రియలు సూచించి ధౌమ్యుఁ డవ్విధి నడచె.

ఆ పలుకులు విని యంధనృపతి బలవద్విరోధంబు వంశక్షయకరంబును బ్రజాక్షయకరంబు నని వెచ్చనూర్చుచుండె. అప్పుడు సంజయుండు "రాజేంద్రా! పాండవులు తమ్ముని కొడుకులని కాని ధర్మికులని కాని శాంతచిత్తులని కాని వగవక రాజ్యదూరులఁ జేసితివి. కోరిక [illegible]రిన పిదపఁ బై కిట్లేల వగచెదు? నీ వడ్డుపడియున్న నీ కొడుకుల వలన నింత పుట్టునే? ఏతత్ఫలంబు పూర్ణంబుగ ననుభవించు కాలము తూర్ణంబు రాకుండునే?" యని యెత్తి యధిక్షేపించె. విదురుఁ డది విని "యిప్పుడేని మించినది గలదే? వంచన వదలి పాండవులఁ బ్రార్థించి తెచ్చి వారి రాజ్యంబున నిలిపినఁ గాటియ లేల పుట్టు?" ననిన వినని యట్లాంబికేయుం డుపేక్షించె.

శ్రీకృష్ణార్పణము.

